# కల్యాణకైవర్తకము

శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి



థాఽస్మృత గ్రంథమాలా పక్షమున
కృష్ణా బుక్ డిపో, తెనాలి.

రెండు రూపాయిలు

# కల్యాణకైవర్తకము

శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి

శ్రీరామ కథా౽మృత గ్రంథమాల పక్షమున

శ్రీ కృష్ణా బుక్ డిపో, తెనాలి.

శ్రీ శివాయ గురవే నమః

# కల్యాణకైవర్తకము

## ప్రథమాశ్వాసము

శ్రీ విద్యామహనీయయోగమున నిర్విక్తాంతరం బైన చే
తోఽవస్థానమునన్ నిరంతరము "సోహంహంస" భావంబుతో
భావింపంబడు న మ్మహేశ్వర పరబ్రహ్మమ్ము మ మ్మేలు న
త్త్వావష్టంభ సుఖానుభూతి భవభావాభావ భానమ్ములన్. ౧

అని యిట్లు సర్వేశ్వరస్వరూపానుసంధానపరుండ నై యుండి యెడనెడ స్ఫురించు వాగ్బ్రహ్మంబు బ్రహ్మాది స్తూయమానచరితామృతుం డయ్యు నగుణగోచరుం డగు గోచరసార్వభౌము లీలాయితంబు నావర్తించుటం గృతార్థంబుం బొనరింప నెంచుచోఁ బ్రసక్తానుప్రసక్తంబుగా సాగిన హాలాస్యమాహాత్మ్యమునందలి కైవర్తకన్యాపాణిగ్రహణము ననుబంధించు గద్యపద్యాత్మకరచనావిశేషంబు నాకర్ణించి యస్మత్పితృపాదు లగు శ్రీరామకథాఽమృత కవివరులు. ౨

అంకిత మొనర్పు దీని శిష్యప్రవరుఁడు
భవ్య పిశిపాటివంశ సంభవుఁడు నైన
సరసమతికి సీతారామశాస్త్రికి నని
ననుచు బ్రీతి నాదేశించిన సునయమున. 3

శ్రీవిద్యామహనీయయోగమున నిర్విక్తాంతరం బైన చే
తోఽవస్థానమునన్ నిరంతరము సోహంహంసభావంబుతో
భావింపంబడు నమ్మహేశ్వరపరబ్రహ్మమ్ము పాలించు స
ద్భావర్థిం బిశిపాటివంశజుని శీతారామశాస్త్రీంద్రునిన్. ౪

అజగోవిందమహేశ్వరుల్ సుకవినిధ్యాత ల్తదీయాంగనల్
గజవక్త్రుండు కుమారుఁ డింద్రుఁడు మొద ల్గా వేల్పులున్ మౌనులున్
విజయశ్రీ సుఖసంతతు ల్వెలయ నుర్విన్ సత్యనారాయణా
గ్రజు దీర్ఘాయుడుపేతుఁ జేయుదురు మత్కావ్యేశు నశ్రాంతమున్. ౫

అని శుభాశంసాపురస్సరమ్ముగ నీకృతి నాకృతిఁ బ్రతిపాదింప నియ్య
కొంటి. ఇఁకఁ దదీయవంశపరిపాటి నించుక వివరించెద. ౬

సర్వోత్తమం బైన సప్తర్షిమాలిక
ధన్యుఁ డెవ్వాఁడు మధ్యమణిభూతుఁ
డెల్లలోకంబుల నెల్లకాలంబుల
నెవ్వానికీర్తి యహీనవిశద
బ్రహ్మ మెచ్చించి యెవ్వాఁడు వేదంబుల
నవతరింపఁగఁజేసె నవనియందు
శ్రీరామమూర్తికిఁ బ్రీతిమై నెవ్వాఁడు
వేల్పులఁ బనిఁగొని విం దొనర్చెఁ
బ్రలయకాలంబులందు నపవ్యయుండు
చిరతపస్సంప్రబుద్ధుండు సిద్ధమూర్తి
వర్ణనాతీతుఁ డే భరద్వాజమౌని
వెలయు నల ఘను వినకున్న వీను లరుదు. ౭

అమ్మహామునీంద్రు నన్వయారణ్యంబు
బహుముఖంబు దానఁ బ్రథితిఁ గాంచెఁ
బెద్దతిక మెసంగఁ బిశిపాటివా రను
తెగ రహించు దాన నొగి జనించి. ౮

నానావేదవిశారదుం డనఁగ గుండారాయణిం గారి యా
స్థానిం బేర్కొన నై మహీధనయశస్సంపత్తు లార్జించె మే
లౌ నా వేంకటరామసూరివరుఁ డా యర్ఘ్యుండె యింకొల్లు స
న్మానించెన్ స్వనివాసతం గొణిదెన స్వర్జించి తత్ప్రార్థనన్. ౯

ఆ ద్విజు గోత్రాపత్య మ
సద్విముఖుఁడు లక్ష్మయ యన జనిఁ గనె నొకరుం
డద్వైతమొ స్వద్వైతమొ
సుద్విజు నొక సుతునిఁ గనియె సుబ్బవధానిన్, ౧౦

విదితయశుఁ డతండు వెంకమ్మఁ బెండ్లి యై
పిచ్చయాఖ్యుఁ గనియె నచ్చరితునిఁ
బెండ్లియాడె వాఁడు వెంకటసుబ్బమ్మ
మెచ్చువచ్చు నల్ల మిథునము సిరి, ౧౧

హరితగోత్రమునందు శిష్టాన్వయమున
వఱలు రామమనీషి యువ్వనితఁ గనియె
సగ్రజుఁడు హనుమంతయ్య యనుజని హను
మాయియుం గాఁగ నది గరిమంబుఁ గాంచె. ౧౨

అన్వయమ్మున కలమికిఁ ననముఁ గూర్పఁ
జాలు వేంకటసుబ్బమ్మ యాలు గాఁగ
భోగములు జాగములు భూమిభాగమునకుఁ
గృతములుగ నొప్పెఁ బిచ్చయ్య గేస్తుతనము. ౧౩

తల్లిదండ్రులకును గుణాధాన మమర
జాతు లైరి సీతారామశాస్త్రి యనఁగ
నరవి సత్యనారాయణశాస్త్రి యనఁగ
నట్లు శేషమ్మ చిన్నశేషమ్మ యనఁగ. ౧౪

హరితగోత్రంబున నావిర్భవించినాఁ
డాత్మానుగుణయోగ మందినాఁడు
చదువులలోఁ గల సారంబు నరసినాఁ
డనుభూతితో దానిఁ బెనిచినాఁడు
షట్కర్మనిరతుఁ డై సమయమ్ము నడపినాఁ
డుభయవంశమ్ముల నోమినాఁడు
యౌవనసంతానప్రతానమ్ముఁ గన్నాఁడు
విద్యాన్వయమ్మును బెంచినాఁడు
పోతుకుచ్చి చెల్లయశాస్త్రి పూతచరితఁ
గూతు నాత్మానుగుణగుణగుంభఁ గూర్చె
మాన్య వెంకటసుబ్బమ్మ మహితవిధిని
సీతరామయ్యశాస్త్రికి సిరులు వెరుగ. ౧౫

శ్రీయుతకప్పగంతుకులశేఖరుఁ డార్యుఁడు రామశాస్త్రి స్వా
గూయుజనుండు కౌశికసగోత్రుఁడు దా వరలక్ష్మినామ్ని వి
ద్యాయుత సాధ్వి స్వీయఁ దనయన్ నయ మొప్పఁగ నిచ్చె సత్యనా
రాయణశాస్త్రి కా యుభయ మట్లభయ మ్మయి సంసరించుచోన్. ౧౬

ఆద్యదాంపత్యమునకుఁ బిచ్చయ్య నాఁగ
నట్లు జానకిరామయ్య యాంజనేయు
లన జనార్దనుఁ డనఁగ శేషమ్మయు వర
లక్ష్మియు నన సుతులు సుత ల్గాతు లైరి.

అందు జానకిరామయ్య నాత్మవంశ
కరునిఁ గాఁ గొనెఁ దనసతి కాంక్ష నెఱయ
సత్యనారాయణుఁడు భ్రాతృసంతతి తన
సంతతియ యను మనుశాస్త్ర సరణిఁ గనియు. ౧౭

అత్తకు ననుకూల లై కోడలు రహించుఁ
గోడలికిని మదిఁ గూర్చు సత్త

తోడికోడండ్రలోఁ దోఁచదు పొరు పింత
యన్నదమ్ముల కెట్టు లది జనించు
కొడుకులుఁ గోడండ్రుఁ గొల్తు రిచ్చలు మెచ్చఁ
గూతుండ్రు నల్లుండ్రు నీతి మీఱ
రేవంక చుట్టాల కేనియు నీసు లే
దాశ్రవు లై జ్ఞాతు లనుసరింతు
రర్థు లతిథు లభ్యాగతు లాప్తకాము
లైనతంబును దీవింతు రయము వెరుగ
నెందు లోపంబులేని గే స్త్రిధరిత్రి
నన్నుతుండు సీతారామశాస్త్రి యొకఁడె ౧౯

గురువుల భక్తిమైఁ గొలిచి నిస్తంద్రుఁ డై
చదివెను వేదశాస్త్రముల మతము
లాచరించెను మును పా చదువుల విన్న
కన్న ధర్మంబు లుత్కంఠ నెఱయ
సౌరససంతాన మదనంబు గానప్త
సంతానముల కల్మి సంతరించెఁ
దగినవ్యాపృతియందుఁ దవిలి సంపాదించె
గుడువఁ గట్టం బెట్టఁ గడు ధనంబు
లిచ్చుచోఁ దన కని యేమియు నుంచక
యడిగినట్టివారి కడిగినట్లు
లిచ్చిపుచ్చె సౌర యెలమి సీతారామ
శాస్త్రి తమ్ముఁ డెదియు సమ్మతింప. ౨౦

పాఠశాలఁ బెట్టి పండితులకు జీవ
నంబు లిచ్చి భోజనంబుఁ బెట్టి
చదువుకొనెడువారిఁ జదివించెఁ బుణ్యం బ
గణ్య మని ఖలే జగంబు పొగడ. ౨౧

కరుణాశాలి యకామకర్మఠుఁడు షట్కర్మాష్టకర్మావధా
ని రహశ్రీహఠయోగయోజనకలానిష్ణాతుఁ డిష్టక్రియో
త్తరుఁ డంచుం గొనియాడు భూజనము సీతారామయోగీంద్రు న
ప్పరముం బోలినవాఁడె తమ్ముఁడును దద్భాగ్యమ్ము సామాన్యమే.

చిత్రము చిత్ర మొక్కటి విచిత్రము చెప్పెద నన్న యాయఁ ద
త్పాత్రము లప్పటప్పటికె భారము భార మటంచు నేగుచో
నాత్రముతోడ వెన్నవిలి యంతయొ యింతయొ యిచ్చి వచ్చుచా
రిత్రమువాఁడు దమ్ముఁడు విరించియ నేరుచు నిట్లు కూర్పఁగన్.

ఇంత బలగము గలవాఁ డనంత సుకృతుఁ
డకృతసంధానచణుఁడు మహామహుండు
కృతికిఁ దగువాఁడు పొమ్మని మతిఁ దలంచి
నేనుఁ గృతకరణీయుఁడ నైతిఁ గన. ౨౪

సత్యనారాయణాఖ్యు నస్మద్వసతికిఁ
బంచి పిలిపించి ధర్మభవనమునందు
సీతకును రామునకును స్వస్త్రీయుచేతఁ
బెండ్లి సేయించుచుండి యావేల గోష్ఠి. ౨౫

గురుపుత్రు లగుట మాకుం
గురుతుల్యులె యనఁగ నేల ? గురులె మనగురుల్
వెరిమ మిము నీ మముం గొన
నరి కృతి కాన యిడిరట్టె నమయు మిది యనన్. ౨౬

ఇరువదినాలు గేండ్ల వయ సిప్పుడు మా కృతికన్య కెంతయున్
సురుచిరకర్మనిష్ఠులరు సూరివరేణ్యులు మికు నచ్చినన్
గురువరు నానతో నిడుటకుం గనరా నొక సంశయంబు మా
కిరవుగ దాని నప్పె తమకిచ్చిన వాచికధర్మపద్ధతిన్. ౨౭

అని చనువుమెయి సోపహాసమ్ముగా నని యేనును మత్పితృసంకల్పంబు సానుబంధం బొనరింపం దొరకొంటి - అదియు— ౨౮

ప్రాచీనకవుల త్రోవ మ
దాచార్యులు నడచుటం దదాదరభక్తుల్
నాచేతమ్మునఁ గలిమిఁ ద
దాచారము ననుసరించి యనుసంధింతున్. ౨౯

ఏవంవిధగుణనిధికిన్
భూవిబుధకులాగ్రగణ్యపుణ్యజనికి నం
భావితసీతారామా
ఖ్యావిఖ్యాతునకు సర్ధికల్పకమునకున్. ౩౦

అంకితంబుగా నా యొనర్పంబూనిన కల్యాణకైవర్తక మను ప్రబంధ రాజమ్మునకుఁ గథాపరిపాటి యెట్టిదనిన. ౩౧

## కథా ప్రారంభము

శ్రీమహితగుణవిభూషణ!
హేమమణీదానవిత్త! యింకొల్లుపురీ
ధామ! పిసిపాటిసీతా
రామమనీష! నిరంతరధ్యానకృపీ! ౩౨

అకర్ణింపు మీ కథ స్కాందపురాణమునందలి హాలాస్యఖండంబున సుందరేశ్వరలీలానువర్ణనసందర్భంబులోని దగుటఁ బూర్వ లీలాశ్రవణంబున నుచ్ఛ్వాసమానసు లగు జ్ఞాననిష్ఠముఖ్యులు తదనంతర లీలాకర్ణనాయత్తచిత్తులయి యమ్మాట పుట్టించుటయు వహ్నికుండసముద్భూతుండును వేదవ్యాసశుశ్రూషాసమధిగతసర్వపురాణ రహస్యుండును నగు రౌమహర్షిణి సానుమోదంబుగా నిట్లనియె. 33

శ్రీవిజయైశ్వర్యానం
దావహనిజపదభజనుఁ డనన్యాదృశనం
భావితచరితుఁడు శుభగుణ
శేవధి దాశరథి యనము సిరి నలరారుఁ.

ప్రాఁబల్కుగల్కుల పాపటఁ జెందిరం
బై మించు నెవ్వని యడుగుదువ్వ
ముజ్జగమ్ములవారి మురిపెంపుఁ బాటల
నాటాడు నెవ్వని యనమునెలఁత
పుట్టఁబుట్టువు పల్కుపూఁబోడి సొమ్ముల
కొలఁ దీర్చు నెవ్వని గొనములచ్చి
తనుఁ గొల్చువారి వంతలఁ బెట్టు లేసుల
గెంటు నెవ్వని కడగంటిపంట
వాఁడు ముక్కంటి వింటిచేవలకుఁ ద్రుప్ప
పుడమిచూలి యెడఁదదమ్మిఁ బొదలు తేటి
చెట్టరక్కసిమూఁక ముచ్చిచ్చు రాజు
రాజనఁగ రాజె శ్రీరామరాజమౌళి. 38

ఆరాముండు మహేశు కార్ముకము శౌర్యస్ఫూర్తి భంజించి సీ
తారామామణిఁ బెండ్లి యై పితృనియుక్తం బంచు వర్తించుచో
నారామంబుల దుష్టరాక్షసునిచే నా రామఁ గోల్పోయి త
ద్వీరాటోపనిశామనార్థము పయోధిం గట్టె ము న్సేతువున్. 39

ఎద్దాని పరిసరం బెలయించులలి మించు
రామేశ్వరాఖ్యతీర్థంబు సార్థ
మెద్దాని దరిపాలం బే నని యొడలించు
బ్రహ్మగ్రహాళి నంబరముఁ బరము
నెద్దాని పాలిమేర బుధు లౌనన రహించు
దర్భశయ్యాఖ్యానతల మతులము

నెద్దాని క్రొంగాన్పులెనకం బెఱింగించు
స్వర్గీయజనుల కాశ్చర్యచర్య
నది యహస్కరు విజయమ్ము హరిమహమ్ము
రఘుకులీనుల సుయశమ్ము రాము సామ్ము
మానవాఽదుల గోర మ్మమానుషమ్ము
తొడుసుగమిఁ జిమ్ము రామసేతుస్థలమ్ము. ౩౭

ఆసేతుపరిసరమ్మున
భాసిలు రత్నాకరుం డభంగతరంగ
శ్రీసంగతి రన్యజన
వ్యాసంగము మెచ్చుచుండు ననిలు మొగమునన్. ౩౮

కలిమికన్నియ పుట్టిల్లు కలువతేనిఁ
గన్న పెన్నిధి జేజేల యన్నదాత
పుడమి మొలత్రాడు వెన్నుని పడకటిల్లు
నగు మహోదధి వర్ణింప నలవి యగునె. ౩౯

నెగయు రసాలసాన్నిధ్యమ్మునఁ బెనంగి
పురుషాయితశ్రీలఁ బొదలునవియు
నవకం బెనంగు పున్నాగంబు లాలింప
నెఱఁగి నతీత్వంబు నెరపునవియు
గణికల పేరె రాగం బింత కల దెదఁ
జుమ్మని చివురుకే ల్చూపునవియుఁ
దమకుచమంజరి దరి భ్రమించు మిళింద
పతి నెంచి త్రపఁ దలవాంచునవియు
నగుచు నభినవసింధుకన్యాప్రతీతి
వఱలు లతికామనోహరీపాళి నెనసి
విష్ణురూపంబునఁ జెలంగు వృక్షవితతి
చెలువు గొనరుచునుండు న జ్జలధితటము. ౪౦

## అ పూ ర్వ స్త్రీ వి హా ర ము

అతిపౌరందరనందనేందిరరసాభ్యంచత్తదారాదిలం
దతతాపింఛవనాంతరంబున సుమోద్భాసిస్మరాశోకమూ
లతలంబందు నకృత్త్రిమం బయిన యేలావల్లరీకుంజసం
భృతవేదికా లలితాంగనారచిత మై మే లీను పూపాన్పునన్. ౪౧

పతిఁ బాసి యొంటి శాపవశంబున మెలంగు
నద్రిజాతార్థ నర్థాంగ మనఁగఁ
దన యిచ్చవచ్చిన తలముల విహరింప
హరియురం బెడసిన సిరి యనంగఁ
గామశాస్త్రవుని నకాముఁ జేసెద నని
వేసిన రతిదేవి వేన మనఁగ
బ్రహ్మసృష్టి ఘుణాక్షరన్యాయమునఁ దాన
చెలగు విచ్ఛిత్తివిశేష మనఁగ
నెనక మెనఁగెడు పసిడిమై మినమినయును
గనటుబేడినయునిఁ గసరి సిరిఁగొన్న
కలికిమాపులు గల యొక కలికిమిన్న
చెన్ను మిన్నంద నుండె నాసీన యగుచు. ౪౨

అవ్వనదేవతయేమొ
జవ్వనమునఁ దెల్వి సిరిని జక్కఁదనమునం
దెవ్వరి మెచ్చఁగఁబో దది
పువ్వులవిలుకాని యస్త్రపుంజిగి కాదో ? ౪౩

అలివేణి తన్నుఁ బోలిన
లలనలు నల్వురు భజింప లక్ష్మివాణుల్
గొలువ జయవిజయ లెనసిన
కలిమిఁ బ్రకాశించు గౌరి గా మదిఁ దోఁచున్. ౪౪

పంచి పనిఁగొను కతన నప్పద్మవదన
యందుఁ గాన్పించు నొకకొంత యధికవిభవ
మట్లు పరివశ్య కగుట వయస్య లంతె
యామె ప్రతిరూప మన నొప్పి రా నెలఁతలు. ౪౫

ఆరమణీవతంస మటు లాత్మసఖీవృత యై యశోకభూ
మిరుహమూలమందుఁ గలిమిం దులకించుచు నాటపాటలం
గూరిమిఁ గొంత ప్రొద్దనిచి కోమలసూనవనీవిలోకన
శ్రీరతమానసాబ్జ యగు రీతి నొకించుక నన్నుసేసినన్. ౪౬

చెలులు దిగ్గన లేచుచుఁ జెలువ మొలయు
నౌ నవు నటంచుఁ దరుశాఖ నందికొనఁగ
జెలఁగు లత లట్లు మై వెంచి చేయి సాచి
యన్నెలఁత భావ మెఱిఁగి యిట్లని వినిచిరి. ౪౭

అనురాగం బనువార నిల్పు మెద రక్తాశోకభూజమ్ము పైఁ
జనుదె మ్మీ సురసాలసాలకలికాంచన్మాధవీయూధికా
వనసీమావలిఁ జుట్టివ త్తము విలంబం బేల యేలాలతాం
గిని వే వీడ్కొనిరమ్ము లెమ్ము సుదతీ! కే లందికొ మ్మిమ్ముగన్. ౪౮

వనిత! యనురాగవల్లి ప్రవాన దోహ
దమున నభివృద్ధిఁ గను నని తజ్ఞులంద్రు
గరిమ విహరించి క్షణ ముపామర తరుపథ
మున శివాశోకమును జేరి మురువెనయుము. ౪౯

అనుచు గారాబునెచ్చెలు ల్వొనుచు పలుకు
లమృతధారలఁ బోలి తీయదన మీఁయు
లేచి యొకలేమ చెయి పట్టి పేచియున్న
యంచపిండువు గతికల లలవరింప. ౫౦

మనసు గన్నులు జూపించు మార్గ మెనసి
గంధగజయాన చను మందగతికి మఱియు

మాంద్యముం గూర్చి చెలుల యమందనమ్మ
దానులాపాఽపలాపప్రహానకృతులు. ౩౧

ఉవిద! యీపొలము బహువ్రీహిఫలశాలి
తత్పురుషార్హ మీ తావు లలిత!
తన్వి! యీ పొలిమేర ద్వంద్వసుఖాపాది
యవ్యయీభావ మీ యదనున సఖి!
వనిత! యలోపంబు వఱలెడు నియ్యెడ
ద్విగుసమాహార మీ దెస లతాంగి!
రమణి! తద్ధితలతారమణీయ మిచ్చోటు
సౌఖ్యకృచ్ఛుభ మీ స్థలము చెలియ!
రాజపురుషోత్తమాంగనారసికసుఖన
మాన సుమహావిభాషావిహరణయోగ్య
మివ్వన మటంచు సామర్థ్య మెఱుకసేసి
ర మ్మహిత కా హితార్థ లా యా పదముల. ౩౨

పూఁదీవ మేఁదీవ పొంకంబు లందించు
కొను తేవఁ బూవు లిగుళ్ళు గోసి
కందమ్ములుం దమ్ము లందమ్ము చెరినగ
మ్మనుకొను నట్లు పద్మినుల నెనసి
యంగాళి భంగాళి యై చెమ్మచెక లాడ
నుజ్జ్వలరసముల నోలలాడి
కూకూలు కూకూలఁ గేకలు కేకల
నేకీభవింపఁగా నెదురువలికి
తన్నుఁ గనుఱెప్ప లట్లు నేస్తమునఁ గొలుచు
చెలిమికత్తియలు పరివేష్టింపఁబూవు
టీరమునఁ జేరి యా నారి వారి వారి
గీతి నైపుణి నొగిఁ బరీక్షించుచుండె. ౩౩

అంతఁ దన యనుజాత యౌ యామవతికి
నయినవరుఁ గూర్పఁ దా నినుం డన నెగడుట
రశ్మి నొసఁగెద నిదె యని రాజు నెమకఁ
జను విధమ్మున నమరె భాస్వంతు డపుడు. ౫౪

నవపురుషప్రాప్తి

అతఁడు శీతవాతపృథుకానుచరుం డగువాఁడు చంద్రుఁ జే
చేత జయించు మోమునిరి జెల్వగువాఁడు మనోజు నమ్ములం
బోత యనంగ నైన మెయిపోఁడిమివాఁడు మహేశవైభవో
పేతుఁ డొకండు వచ్చి నలిపెం దదుపాంతమహిన్ విహారమున్. ౫౫

తలఁ జలువతేఁడు మినువాఁక వెలయునేని
బాపపూసరు లొడలిపై వఱలునేని
నొసట నింకొక కనుదమ్మి పొసగు నేని
నంగజహరుం డితండె యనంగవచ్చు. ౫౬

లలితశివావతారము కలంక మెఱుంగని సోముఁ డుగ్రు పెం
జలమునఁ గాలుపోని సుమచాపుని రూపు సతీవశాత్ముఁ డౌ
నల నలకూబరుం డనఁగ నౌ నతఁ డాతఁడు కందు నందు నం
కలితదృగాత్ముఁ డై యెనసి కాంచె లతాతను లున్న కుంజమున్. ౫౭

అందు నందమునకుఁ జంద మనువుపఱుచు
దాని నూనాస్త్ర నస్త్రంబ పోని దాని
లోక మేలఁగ జాలు నాలోకపాళి
ఖూలి లోగొను బీరంబుఁ జూపుదాని. ౫౮

అంచితగుణ నల చెలువం
గాంచి యఖండైకరసవిగాహితుఁ డగుచున్

వంచిన తల యెత్తక యా
పంచశరుని నెమకఁ జొచ్చె భావమునందున్. ౫౯

ఆలలనావరోధము లతాంగుల వ్రపముకల్మిఁ జేర నౌ
వీ లొక యింత గానక స్వవీక్షణసంతతి నాఁగు తద్దృశా
పాలుల ధీరతాస్థితి కపత్రపతోఁ బయిలోడి నిల్చి శం
పాలత మేలు గేలిఁగొను భావిని నింకొకసారి కన్గొనెన్. ౬౦

ఆ మహామహు దృగ్రమ యరుగునపుడు
నందియము సంభ్రమము సంతపమ్ము విస్మ
యమ్ము మొదలు గొనాలు పహాయ మైనఁ
గదలలేకుండెఁ దిరిగె నాక్షణ మొకండు. ౬౧

ఆయెడ నా దేవాయితుఁ
డాయతలోచనకుఁ బఱచు నాత్మహృదయమున్
దాయఁగనేరం డాఁగుట
కే యనువున నాఁగుఁ జిత్రమే యవ నాయెన్. ౬౨

## రాగరసము

అచెలువఁ చేరఁజన నెంచ నంఘ్రులొప్ప
వప్పటికె కల్గె స్తంభభావాతిశయము
జాగరూకత గాదె? విశాలలోచ
నాలవాలదృశావల్లు లల్లు పెల్లు. ౬౩

ఆ నరవర్యు బాహుయుగళాహిత హౌ వలయద్వయమ్ము ని
ర్మాణ విశేషవైభవభరమ్మున హారముఁ బోలి వ్రేలెఁ దా
నూనవనీవిలోకమునఁ జొక్కుఁడికేమియుఁ గోరఁ డిజ్జగం
బేనిఁ దృణంబు గాదు మది కేమియు నిష్టము గాదు వానికిన్. ౬౪

మారు శరీరసుందరత మాయము సేసి కలంచు వాని సి
గ్గ రహి సంస్మరించుఁ గనియెం గనినట్టులె కొంతసేపు దు
ర్వారమనోజవశత్వమున వర్తిలెఁ బిచ్చదనంబు దోఁచ న
ట్లారమణీయశేఖరుఁ డనంతర మింద్రియతంద్ర నందియున్. ౬౫

అంతకుని గెలిచె ము న్నా న
సంతగుణుం డైన కతన నాతఁడు కాంతా
చింతాసంతానాంతరి
తాంతర భావప్రపంచుఁ డయి మెయిమెయితోన్. ౬౬

కలికిఁ గనుఁగొను క్షణ మందె కలిగె నిట్లు
పదియు పండ్రెండొ భావజభావము లిఁకఁ
గలుగఁబోయెడు నెడ యెన్ని గలుగఁజేయు
నో యది వచింపవచ్చునొకో యలంతికి. ౬౭

ఏమియుం దోఁచకుండు నయ్యెంతిఁ దలఁచుఁ
గాంచ నుంకించుఁ దలయెత్త నెంచు వంచు
మించు కోర్కుల కెలయు వాంఛించుఁ జేరఁ
గోరు మాటాడ నాకొమ కొమరు గొనరు. ౬౮

ఇటు లున్నవానిఁ గనుఁగొని
చటులాలక లింతి చెలులు సంభ్రమమున మా
ఆటరుద్రుఁడొ ? మరుఁడొ ? నిశా
విటుఁడో ? మాధవుఁడొ ? యనుచు విస్మయ మెనయన్. ౬౯

ఆ నీలాలక కాయెడ స్వేదలు శ్వాసావాసగంధప్రవా
హానందంబున కుబ్బి మొత్తి మను భృంగౌఘంబు పైఁ బర్వ నా
యానీలచ్ఛవి నూహసేయఁదగె హృద్యం బంగజాతోత్థితం
బానద్ధం బగు పహ్ని చేరె రతి లజ్జానంతరప్రాప్త యై. ౭౦

ఇంత బహిరింద్రియమ్ముల వృత్తి నాఁగి
యింక లోలోన గొణఁగెడు నెడఁదఁ గనరి
విజ్ఞుఁ డగు యోగి మాదిరి విభుని రూపుఁ
బొందెఁ దా సయి యైకాత్మ్యబుద్ధివృత్తి. ౭౧

చూతు వల దెట్టు లుండుదుఃఁ జూడకుండ
నౌతఁ గనంగవచ్చుఁ బో యంతదాఁక
యాఁగెదనె ? యాఁగ కేమి లే ? యనెడు వృత్తు
లతివ మతి రేఁగఁ బెరసిరి రతియుఁ ద్రపయు. ౭౨

సిగ్గు తల కెక్క రతిదేవి చిత్తతలము
నాక్రమించెను మగని కాయమ్ముఁ బెంప
మార్గములు రెండు కాని యమ్మగువ లిరువు
రొరుల రాస్యమ్ము వెలివుత్తు రొక్క పనిగ. ౭౩

ఈరీతి నాతలోదరి
మారాతిగహోతిధూతమానస యై గం
భీర మగు ప్రకృతి నిట్లు వి
చారణ సేయంగదొడఁగె స్వగతముగ మతిన్. ౭౪

ఎవ్వఁ డీ ఘనుఁ ? డెవ్వఁడో యేని నిట్లు
నా మనం బేల పరువెత్తు నాయమునకుఁ ?
బరుఁడు గాఁ డాత్మబంధుఁ డీ పరముఁడు మది
యన్యజన్మసంబంధంబు నరయఁగలదు. ౭౫

వీఁడు విధుండె కాఁ డికఁ గుబేరుకుమారుకుఁ డౌనె ? కాఁడు పో
కాఁడు పులోమజావిభుఁడు కంతువసంతజయంతులందు నె
వ్వాఁడును గాఁడ యీ కుదురు వచ్చునె యల్లరికుఱ్ఱమూఁక ? కీ
పోఁడిమి గల్గుఁ బో భువనమోహనమూర్తికి సాంబమూర్తికిన్. ౭౬

చెవిలో నేమొ వచించుచున్నయది వాసిన్ దృగ్విలాసంబు బా
హువు లాజానుపరీతము ల్వలయరత్నోదారభానంబు లా
యవలగ్నం బను సింహమధ్యమును హేయుం బంచు సర్వేశ్వర
త్వవివర్తంబుల యంగకంబులు మహత్త్వం బెన్న సామాన్యమే? ౭౭

ఈ పరము నర్ధదేహం
బే పొలతి యగుం దదంఘ్రి యే జగ మేలున్
శ్రీపతిముఖ్యనమస్యా
వ్యాపారము కల్మి ననుచుఁ బరవశ యయ్యెన్. ౭౮

అట్టు లాతఁడు నెమ్మది నంకురించి
యప్పుడె ద్విపత్రితం బగు నాత్మరాగ
వల్లరిఁ దదీయదేహలావణ్యరసము
చేఁ దనియఁజేసి తలఁచె నిశ్చిత ముచితము. ౭౯

ఈ చెలువ లేనినాఁ డిఁక
నా చెలు వింతేని గలదె? నలినేక్షణ న
న్నేఁచునొ? యనుగ్రహించునొ?
నా చిత్తము వశము గాదు నను నూరార్పన్. ౮౦

అనుచు నీరీతి నన్యోన్య మధికరాగ
రసనమంచితదృగ్రమఁ గొనరుటయును
వారిఁ గనుఁగొని వారుణిఁ జేరఁజని య
హస్కరుఁడు గూడ రాగమయాత్ముఁ డయ్యె. ౮౧

ఆ వనజాక్షి నెచ్చెలు లహఃపరిణామముఁ జూపి చెప్పి వి
ద్యావతి! యిమ్ముఁ జేరుదమె? యమ్మ వచింపదె వచ్చువేళ? వే
రావలె నంచు నం చని త్వరంపడఁ దత్సతి యుండరాకయుం
బోవఁగరాకయున్ మది నపూర్వపు రాయిడి కయ్యె నయ్యెడన్. ౮౨

ఎవరి భావగతుల నెఱుఁగుదు రవ్వారె
కుట్టి తీయ నొరుల కెట్టు లమరు
నింతలోనె వాఁడు నెనసెఁ దత్ప్రాంతమ్ము
మహిళ లెల్ల సంభ్రమమున లేవ. ౮౩

వలదు సంభ్రమంబు వనజాక్షులార! న
న్నరునిఁ గాఁ దలంపఁ బాడి గాదు
యరయరా నొకొండు స్వార్థప్రవృత్తి నా
కన్యకార్యపరత నైతి నిట్లు. ౮౪

అనుచు నే మేమొ పలుకుచు నంతనంత
జేరి వారును బురుషవైశేష్య మెంచి
చేయు నుచితోపచారముల్ చిత్తమునకు
నమ్మదముఁ గూర్ప ని ట్లనసాగె నతఁడు. ౮౫

## ప్ర సం గ ము

ఇది సుధర్ముని కూతురే గా? మగువలార!
ధీవరుం డతఁడు సుధీవరుండు
న న్నెఱుంగఁడొ కాక త న్నెఱుంగుదు నేను
మీ రెల్ల నా పరివారమె మును
మఱచితిరో కాక మాలిమి యేమి శా
శ్వత మని యనెద నసత్య మైన
దాశపాలనమునఁ దవిలి వర్తించెద
మధురపురమ్ము నా మనికిపట్టు
చాపఁగా నేల? యున్నతత్త్వంబుఁ దెలుప
మునుపు నా రాణి యీ జగన్మోహనాంగి
యొక్క కారణమునఁ బుట్టు వొందె నిందుఁ
జిత్రముగ వచ్చితిని దీని చెలిమిఁ గొనఁగ. ౮౬

వచ్చుచున్నారు ప్రథమనవ్వటులు వెనుక
వాహనమ్ముల కొఱంత లే దూహ నెంచి
బయలుదేరఁడు మొదలి యప్పుదము సొత్త
మన్నఁ బక్కన నవ్వి యిట్లనె నొక చెలి. ౮౭

ఎక్కడి మాట ? కన్నియల మెవ్వరివారము గాము మేము నీ
టక్కులు చెయ్యిలుం గని యొడంబడి వెంబడి వత్తుమంచు న
మ్మక్క ? తలంచితేమి ? మఱుమాయలమారివి నీ వటంచు నీ
వాక్కులె చెప్పుచున్నవి సెబా సఁక వచ్చిన త్రోపఁ బోఁ జనుణా. ౮౮

అర్థ మొకటి స్ఫురించు సామర్థ్య మిరివి
యన్య మర్థంబు జూపెట్టు నట్టి శక్తిఁ
జూడఁ గవి వని తేఁచెడు సూరివరులు
బుధులఁ గాక ప్రమాణీకరింప రొరుల. ౮౯

ఒంటరిగాఁ జిక్కిన వా
ల్గంటుల మోసమ్ము చేయఁ గాముకు లై యి
ట్లంట పురుషులకు నైజమ
యొంటించెద రెటొ పురాణయుక్తిప్రతతిణా. ౯౦

అని మఱియుఁ బల్కఁబోవ నయ్యతివఁ గన్ను
నన్న వాఁగి మఱొక్కతె శ్రవణకుహర
మం దెదొ ? జనాంతికమ్ము గా నని తదాన్య
మునఁ గలికిమిన్న యనిపించె నొనరుమాట. ౯౧

కా దన నేల ? ఈశ్వరులె కా నవు నేమొ ? నిజంబ పల్క రే
మో ? దురితంబుకల్మిఁ గలబోధము మాసెనొ మాకె ? యేటి కీ
వాదు ప్రవృత్తిధర్మమునఁ బాడి యొఱింగి సుధర్ముఁ గాంచి ధ
ర్మాదయుఁ డాతఁ డీయఁ గొన నైన జగం బది మెచ్చుకుండునే ? ౯౨

కాంచి పెంచినవారికి గౌరవమ్ము
నరన మరుసమ్ము ననము విశాల మొదవ
వారి యిచ్చు వరు వరింపవలయుఁ గాక
స్వైరిణియ కాదె తనయిచ్చఁ జనినకన్య ? ౯౩

ధర్మ్యములె రాక్షసమ్ము గాంధర్వ మను వి
వాహములు శాస్త్రవిధి నందువా ? యుడుగుము
రాజులకు నైచ్ఛికము లవి రాదు నొడువ
మా కొలముపాడిఁ గొని పొమ్ము మాన్యచరిత ? ౯౪

మాన్యుల ననాదరించుట
యన్యాయ్యం బనుచు నిట్టు లంటిమి కానీ
కన్యలకు మాకుఁ దగునా ?
యన్యులతో నిన్ని పల్కు లరయు ముచితముగా. ౯౫

కర్మసాక్షి సంధ్యాంతరితుం డయ్యె. నిట్టి తఱి నిట్టులు మీరు పరమ పురుష లే యైన మీతోఁ బ్రసంగసంగతి నుండుట కులాబలాచారమున కెంతయు సయుక్త మని సర్వవిదితమ కదా ? యింక సెలవిండు విధి కన్యధాత్వము లేకుండెడు మని తగినమెయి న య్యోవత మవ్వనస్థలి మవ్వం బవ్వానిదృష్టికిఁ దోడుసేసి పరిసరపురవరంబు నలంకరింపఁ బోవుచుండుటయు. ౯౬

అంత కనంతసత్త్వమహిమాన్వితు లాతని రూపరేఖలం
బంతముఁబూని పోలు లవి భాసిలువార లపారసంఖ్య లు
ద్భ్రాంతజగత్త్రయావహనదక్షులు తద్భటు లేగుదెంచి త
ద్భ్రాంతమునన్ హసాదు దొర! యం చిరుగేలు మొగుడ్చి రాదృతిన్.

వారిఁ గాంచి చనెడు వారిజాక్షిఁ దలంచి
తన మనంబు భంగి దగ వెతింగి
అల్లనల్ల నల్ల యబ్జాక్షి మై చాయ
త్రోవదెలుప నడువఁదొడఁగె నతఁడు. ౯౮

ముందు పోవుచున్న సుందరి నెఱుఁగదు
వెనుక సాగువాని మన సెఱుంగ
రనుగమించు టుచిత మనుచిత మను దారి
యెఱుఁగ రెయిదఁజొచ్చి రెల్ల రతని. ౯౯

## పుర ప్రవేశము

ఇవ్విధమ్మున న వ్వనజనయన హృజ్జలజ్జాద్వైధీభావమ్మున నివ్వటిలు నెవ్వగ నిమిత్తమ్ముగ వెనుక బరువెత్తు చిత్తమ్ము ముందు గతి సాగనీకున్నను సహజంబగు ధీరభావంబు నవలంబించి యొక్కొక్క యడుగు వెట్టుచు నెడనెడఁ దోఁచు పున్నాగాలింగ్యమానసూనలతాపాలీలీలానుభావంబులకు భావంబునఁ గొణిగికొనుచు నంగీకృతనిజవల్లభసంగీతాసంగభృంగాంగనానంగవశేంగితప్రసంగంబునం గుసగుసలాడు వయస్యల ముసిముసినవ్వులకుఁ గన రెనయుచుఁ బ్రస్తుతాస్వాస్థ్యమునకో? భావివైరవిచారంబునకో? అంచల నెంచక కోకిలల కూహూలకుఁ జీకాకగుచు నెమ్మి నెమ్మి నమ్మక చిలుకల తెలివికి నులికిపడుచు మందానిలుసందుం గల దుందుడుకుం దలఁచి ముందుపోఁచక సంచలించుచుఁ జన న మ్ముద్దరాలి యొద్దిక ము ద్దగుచుండఁ దద్ధ్యానంబునఁ దదవస్థఁ జెందుచుఁ బొదివికొని పోవు నేస్తపుంగత్తెలలోఁ గలిసి తన కన్నె చూపు మరలకే యరుగ నాతండు ననువర్తించుచుండె నింతలో ౧౦౦

భూమి కొలసిసే పురుహూతు పురవరంబొ?
యఖిలరత్నజాతుల నిస్తులాంశుచయమొ?
కాంతితోయంబు లోపల కరుడుగట్టి
సట్టి డివియొ? నా నొకం డగపడెఁ బురి. ౧౦౧

లీలఁ జాలుగ నిడిన ముత్యాల యక్క
రాలఁ గననగు న ప్పవడాల మేలి
డాలుచేఁ గ్రాలుచున్న జెండాలు చందు
వాలమేడల కొక వింత రమ నొసంగ. ౧౦౨

విలసిల్లు నమ్మనికిపట్టుం జొరఁబాఱి పౌరాంగనావారంబులు గైవారంబులు సేయం బోయి పోయి వైజయంతంబుం బోని రమ్యహర్మ్యంబు నంతరాళంబుం బ్రవేశించి యంచిత మగు నల చంచలనయనల యావళి యుచితవృత్తి నుండె. ౧౦౩

రాజమార్గంబున న్వచ్చు రాజమాను
నాయమానుషుఁ గని యొకం డనఘమూర్తి
ఎదురుగా వచ్చి పూజించి సదనమునకుఁ
గొనిచనియెఁ బూజ్యులకు నెందుఁ గొదువకలదె ? ౧౦౪

అవిథిఁ గారవం బెనసి యా నరు నింట సుఖాన నుండె న
ల్లా వనితామణిం దలఁచు నాత్మకు మాత్ర మనీశుఁ డౌచుఁ ద
త్పావనభావ మెంచు మతి భావన మారవిరోధ మారయం
గా విత గా నతం డౌరుల కంటికిఁ జిక్కని భావసంపదన్. ౧౦౫

అనిన విని జ్ఞాననిష్ఠాదు లుత్తరకథాయత్తచిత్తు లగుటయు ౧౦౬

క్షోణీదేవోత్తమ ! శ
ర్వాణీవల్లభదయాప్తవైభవ ! సర్వాం
గీణాస్తికతాసారా !
ప్రాణాపానగతిగమకపవనాధ్వజ్ఞా ! ౧౦౭

సదుదయకులపాలా ! సంస్తుతేశానలీలా
సృదహృదయన ! భారద్వాజమౌనీట్సగోత్రా !
ప్రహదపదమల ! సీతారామశాస్త్రి ! సదా త
త్తదుచితవిధిదానాదానసంపన్నిధానా ! ౧౦౮

ఇది శ్రీమద్రామకథాऽమృతకవికుమార హనుమాంబాశమిగర్భహవిర్భూరాయ
మాణ శ్రీదేవీసేవ్యమాన రాఘవనారాయణాభిధాన కవి గ్రథితం
బగు కల్యాణకైవర్తకం బను ప్రబంధంబునఁ
బ్రథమాశ్వాసము. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# కల్యాణ కైవర్తకము

## ద్వితీయాశ్వాసము

శ్రీకాపిలపాతంజల
ధీకవితౌపనిషద కృత ధీవర్ధితబో
ధాకర ! సీతారామా
ఖ్యా ! కేవలతానుభవసుఖవ్యాపారా ! ౧

ఆకర్ణింపు మాద్వైపాయనవినేయుం డమ్మునులతో నగస్త్యప్రోక్తమార్గం
బున నిట్లనియె. ౨

అపరవర్షినీతిలక మాత్మగృహంబునఁ జేరి నెచ్చెలు
ల్సేవలు సేయఁగా నుమశిలీముఖసాదితచిత్తసీమ యై
భావమునం దపూర్వవిధిభావసుభావనఁ గూరియుండ మో
హావమతాంధకారము ఘనాంబరమధ్యము నాక్రమించినన్. ౩

రాత్రిముఖప్రసారము

పెట్ట పల్లమ్ము పెచ గిద చెట్టు చేమ
యెఱుఁగరాకుండఁ జీకటియేలు వాఱె
నక్షు లుండియు దీపసాపేక్ష మయ్యె
నఖిలవస్తువివేక మ య్యవసరమున. ౪

నెగసిన యొగుపుతో నింగి మాయముసేసి
బ్రహ్మాండకర్పరభాగ మెనసి
పర్విన పర్వుతో పదిదెసలం గ్రమ్మి
చక్రవాళాద్రి విశ్రాంతిఁ జెంది

చుట్టిన చుట్టుతో బిట్టడలుప్పొరించి
యితరవర్ణంబుల యెలమి మాన్చి
పట్టిన పట్టుతోఁ బల్వుర కనుమూసి
స్వైరిణీవిటుల నేత్రమ్ము వదసి
ధూమపటలమ్మొ? మోహమో? భూమిఁ దిరుగు
మొయిలొ? కాటుక వానయో? మురమథనుని
మేని మేల్దాలొ? యౌవతానూనదృగ్వి
లానమో? నాఁ దమఃపటలం బెసంగె. ౫

అంతకు మున్నినుండు దన కబ్బెడు గోరము నభ్రసంభవ
త్స్వాంతమసాన్యరాజ్య మెడఁదం గని యమ్మొయిఁ బంచినట్టి వృ
త్తాంతము సద్విజౌఘము ముదంబునఁ దెల్పిన నాలకించి త
ద్వ్యంతర మాక్రమించుటకు నాయితమయ్యెను రాజు తేజుతోన్. ౬

ఆవేళకు సరిగాఁ దా
రావళి యొకఁడొకఁడు వరుస నాకసమున సం
భావింపఁదగియె నిరులం
గైవసమొనరించు శీతకరు చారులనన్. ౭

ఆ మృగలాంఛనుం డనుప నప్పటి కప్పుడె తత్ప్రభాచమూ
గ్రామణి పూర్వదిగ్రమణి కౌతుకహాసముఁ జెప్పవచ్చె నా
సోముని రాక కుబ్బి గడుసుందనమందిన యిందుకాంతము
గ్రావములవస్తుసంహతి మహంబున వెల్వెలవారెఁ జీకటుల్. ౮

స్వైరిణీమానసములతో సడలెఁ దమము
విమలసాధ్వీస్మితములతో వెలసె జ్యోత్స్న
ముదునళుల లోచనములతో ముగిడెఁ దమ్మి
లలరెఁ దరుణుల కనులతో సల్ల తొవలు. ౯

అల కరిటికిరాతు తల ముం దలరు సోగ
ముడిపై బెడఁగు లీను పూలచెండొ…
జేజేల నెర దిక్కు సెడి పాలకడలిలో
నెమకిన దొరకిన యమృతఘుటిక
వలికొండరాచూలి కలిమికి సులు వైన
వాపటిచెవి జిగిఁ దనరు కమ్మ
వేలుపుజవరాండ్రు వింతగై సేతచం
దముఁ గానిపించు గుండ్ర మగు సద్ద
మలరువిలుకాని కండ వెన్నెలల పాదు
చల్లవనముల దుంప నిశ గా వరింప
రాగమున నుదయించుచు బ్రాగ్దిశ యను
లలన మొగమున కొక వింత తిలక మయ్యె. ౧౦

అనురాగమ్మున మున్ను దోఁచు తన యాస్యంబందుఁ దీపించు తె
ల్వి నిశానాథు నరాగతానుభవ మోలిం దత్కరాకృష్టకై
శ్యనిభధ్వాంతము చిక్కు చక్రకుచవైర్యక్షోభ మళ్యారవం
బును వాక్రుచ్చెడుఁ బ్రాగ్దిశాంగన రహఃపుష్పమునందర్భముల్. ౧౧

గురుని జవరాలి కలయికఁ గొన్న మచ్చ
పోవ దింక సతం బబ్ధి మునుఁగుచున్న
ననుఁగు చెలికాని కొమ యని యైంద్రివలన
రక్తుఁ డై తెల్విఁ గాంచెఁ దారావిభుండు. ౧౨

అకట తాఁ బోవుచోఁ బిల్చి యప్పగించి
రశ్మి రాజ్యంబు రంగంబు రవి చనెఁ గద
రాజులకుఁ బుఖ్యపాపావరంబు లేదె?
వానిపక్షంబె శిక్షింపవలెనె విధుఁడు. ౧౩

కుముదినుల విప్ప తారాపకోరహాస
వితతి రతనాల తళుకు పృథ్వీజనోన్మ

నస్త్వము మధుండు నియతినిర్ణయము సాయ
మైన నెలమ్రోల నరు లిరు లాఁగఁగలవె? ౧౪

ఇమ్మాదిరిఁ గ్రొమ్మామిడిచిగురాకులఁ బ్రాఁకుటచేఁ గాక రాగవతీహృదయ విహారంబున రాగిల్లియు, వియోగినీకపోలస్థలీసంచారసంచితనవధవళిమ సవిశేషంబు లై, యుత్తుంగసౌధాంగకేతసనంఘటితాక్షరీభూతనీలాశ్మన రశ్మిజాలములచేఁ గాక తత్రత్యకామినీసకామేక్షణగణముల సహవాసంబున మఱింత నల్లవడియు, ఖర్జూరీమంజరీగర్భపరాగపరామర్శంబునఁ బ్రకృతి ననుగమించి, శుద్ధస్ఫటికస్థగితసౌధోపరిభూమికాంశుజాలప్రత్యుద్గమనంబులచేఁ గాక తత్పర్యస్తనవమాలికావిసూనాస్తరణాప్లవనంబుల ముబ్బడిగాఁ దెల్లవారియుఁ దత్రత్యాలంకారికకుసుమకుజముల నాశ్రయించి నీడ యను నామాంతరంబున నజ్ఞాతవాసంబు సలుపు తమంబుల సమాగమంబున మఱింత పలుకవాఱక పైపెచ్చామ్రాఁకుల యాకుల లోపలి సందుల నెమకి యచ్చోటి చీఁకటిమూఁకతో నొకచో నున్కి సురాసురసంధిలక్షణమని చాటుచుఁ గుముదంబులకు మోదంబును జకోరంబులకుఁ బారణంబును జుక్కలకుఁ జొక్కంబును మానినీమానసంబులకుఁ బ్రసాదంబును మారునకుఁ జేయూతయు మాఘవున కుద్బోధంబును మారుతునకు సౌశీల్యంబును పద్మినులకు ముకుళనంబును తద్గతాళులకు బంధనంబును కాముకులకు సన్మానంబును విప్రలబ్ధలకు విప్రియంబును ప్రోషితభర్తృకలకు భయంబును దోఁటలకుఁ దేటయుఁ జేటులకు నీటును నీటునకు నెఱియు నెఱికి నేర్పును బ్రసాదించు నవి యనసూయానాయకు నయనంబుననొ? యుదధినొ? యువకమునసొ? నలువ మనమునసొ? యుట్టిపడినవాని కరములో? కిరణంబులొ? వెలుఁగులో? వెన్నెలలో? చల్లదనంబులో? యుల్లాసంబులో? మాయలో? మంత్రంబులో? నిశ్చయింపరాకుండె నప్పుడు. ౧౫

విరహితుల దురవస్థకు వెత దొఱంగి
భువనమాత పద్మిని పరిభూత గాఁగ
శకునివలె నల ద్విజరాజ చాలి మేన
యుల్లునకుఁ గా జగం బెల్ల నాక్రమించె. ౧౬

అంతకుఁ బూవువింటిదొర యైదు రకమ్ముల తూఁపు లూని దు
ర్దాంతపరాక్రమార్జితమదమ్మునఁ దుమ్మెదనారిఁ జీర ధీ
మంతులె తూలవోయెడు క్రమం బొక వింతగఁ దోఁచె సద్వివే
కాంతరు లైన నేమి చనునా ? మన నాతని చేతఁ జిక్కినన్. ౧౪

అంగహీనుఁ డైన హరవైరి కెక్కడి
గెలుపు గాని వాని కలికి తెలివి
జగముఁ గలఁచి మొదలి సత్కీర్తిఁ జెడకుండఁ
బట్టెఁ బ్రౌఢసతికి భావ్య మదియు. ౧౮

అపుడు పుష్టదేహుఁ డైన శంబరవైరి
నజుఁడు చిట్టెఁ గాల్చె హరుఁడు వేర్చి
ధర్మసూక్ష్మవేది దశరథసుతుఁ డేడి ?
యతనిపేరఁ బోరు రతి జయింప. ౧౯

మగువ మగండు మారుతుఁడు మారుఁడు మద్యము మాల్యజాలముల్
మృగమదముల్ మృగాంకితుఁడు మేడలు మానము మాధవుండు మా
విగములు మావటా లనఁగ విశ్రుత మౌ మమయప్రపంచము
ష్ఠ గెలిచి స్వస్వరాజ్యరమఁ బొందె సుఖాబ్ధి నమప్రధానతన్. ౨౦

కాంతుని దైవమ్ముగాఁ గాంచు కాంతల
కడిమికిఁ గాముఁడే కాకవోయెఁ
దముఁ జేర నిరసించి ధవున కెదురుచూచు
నెలఁతల తలసిగ్గె యొలికిపోయె
విషయాంతరస్థుఁ డౌ విభురాకఁ గాంకించు
వెలఁదుల తలపోత బీఱువోయె
వేరొకొత్తుక కేల విలసిల్లు నాయకు
చానల మానం బ మానమాయెఁ
బురుషు నింట నిద్రవుచ్చి మార్మగలకుఁ
గూర్పఁబోవువారి యూర్పు వోయె

నెఱఁద వరు వరించి యొసయని ముగ్ధల
డెంద మొక్కసారి డిల్లవోయె. ౨౧

తమ కొమలు వంచు దూతిక
ల మనమ్ములకన్న మున్న లక్షిత మగు చం
ద్రమరీచితతివిబోధము
స సుగలు నిలుసేర వేగ నడచిరి కూర్మిన్. ౨౨

లోలత్వము కలహ మపృథ
మౌలలితునిఁ జేరి పలుక నలికెడు చెలి మో
మాలోకించి తదర్థము
మాలయు పవనాంకురముల మనర వచించెన్. ౨౩

వచ్చినసాధు నర్మిలిని పాకొనఁ గగ్గెనఁ బంచి వాని యుం
దిచ్చు నుపాయనంబుఁ గొన నేసను క్రొత్త యొయార మంపి పై
పెచ్చు పొసర్చు లాలనల పేర్మికిఁ జొక్కు నువృక్కలాపముం
గ్రుచ్చియు కౌఁగిలించి యలఘుస్ఫుటసౌఖ్యము సంది రవ్విభుల్. ౨౪

ఈగతి స్త్రీపుంసమహో
రాగఝురిం దేలు పూయ రారాపు రతి
ప్రాగల్భ్యంబున వెలయుట
బా గని మెచ్చుకొనె మామ బలగముతోడన్. ౨౫

## అ యో గ వి ప్ర లం భ ము

చంద్రకాంతశిలావిశాలసంఘటిత మై
రమ్య మౌ మేలి హర్మ్యమ్ములోన
పొగడందు తనదు తావుల నెల్లతావులుఁ
బూరించు మల్లెపూపొదల కెలన

బంగరు మంచంబు పైం బట్టుపఱుపులఁ
బన్నీరు చిల్కు నా పాన్పు మీఁద
క్షణ మైనఁ బాయక చామరహస్త లై
చేరి సేవలుసేయు చెలుల నడుమ
సౌఖ్య మను మాట యనరాక చకిత యొకతె
కలఁగు తనుఁ గాంచి సెజ్జయు నలుఁగుడువడ
నంచితాకారు మారు జయించువానిఁ
గాంచనగువాని నొకని ధ్యానించుచుండె. ౨౬

చెలులకు మాఱు పల్కదు హసింపదు లీలకు నైన శారికం
జెలువుగఁ బల్కరింపదు భుజింపదు పూయదు పెట్ట దూరకే
కలవర మందు నల్ల కలకంఠి యకుంఠితపంచబాణబా
ణాలులితకోమలాత్మ నలినప్సుగ నవ్యథరాధిరూఢ యై ౨౭

మెలకువయో నిద్దురయో
తెలియునొకో తెలియదొకో మదిం గొన దనుచుం
జెలు లారట మెనయఁగ సతి
కలయును నిక్కువముగాని కళవళ మందెన్. ౨౮

దృష్టి దోష మనుచుఁ దెలిపి యొక్కతె నూఁత
నుప్పుకల్లు సుట్టుఁ ద్రిప్పి వైచెఁ
జెట్టుబాచి యనుచుఁ జెలి యొత్తు మంత్రించె
వెల్లుగమికి ముడుపువెట్టె నొకతె. ౨౯

అంగజు డొనకారితన మంచు వచించెదనమ్మ యిట్లు త
న్వంగిఁ గలంచు బాధ యని యుల్లస మొత్తు వచించుచుండ న
య్యంగన యుల్కిపా టొదవ హర్మ్యము డిగ్గి విలాసశైలముం
బంగమపల్లి పెంపఁ బవచారిణి యైవెసఁ జేరె నొంటిగన్. 30

ఒక రొకళుల మోము లుప్పొంతి వీక్షించి
సఖులు వెంటఁబోయి సంభ్రమమున
నల విలాసభూధరావాసమున మావి
తీవ ప్రోలి నున్న భావినిఁ గని. ౩౧

మమ్ముఁ గలుపుకొనక మాయమ్మ నాయమ్మ
యిల్లు విడిచి వచ్చి టింత పవ్వ
హేతు వెదియొ చెప్పు మీదశ కను వారి
మీద లేవ రటంచు మెలత యడుగ. ౩౨

విస్మయమున మునిఁగి వెలఁదులు సఖులము
గా మటమ్మ మమ్ముఁ గని యెఱుఁగ వ
టమ్మ యనుచుఁ జెనసి యాలింగనము సేయ
మానిని తలయూఁచి మఱచితి ననె. ౩౩

ఏటి మఱపు నీ క దెట్టులు ఏడమె సే
తల్లి యనుచు నెడవ తల్లడిల్లఁ
బలుకు తమకు మాఱు పలుకని యాలేమఁ
గని కనికర మార్తిఁ గాంచి వారు. ౩౪

లీలాశైలం బని సు
ఖాలయముగ నున్నదొక్క యన్నఁ దెలిసి యా
లోలనయన సఖి! లీలా
శైలంబా? యిది యటంచు సాగె నడువఁగన్. ౩౫

కన నైన విషయమున కిఁక
ననుమానం బేల మఱనుఁ దతివ తలఁచెదున్
ఘనముగ నని యొండలు దవిడి
వనిత యొకతె యమ్మచెల్ల జ్వరము జ్వర మనెన్. ౩౬

కప్పురము తెచ్చి మెయి నుంచ క్షణము లోన
మాడెఁ జిలికిన నీరంబు మాయ మాయె
నేమి చెప్పుదు నెద నిడ్డ తామరాకు
గాలి యుస్సురుపుగాలికిఁ దూలిపోయె. ౩౭

ఈశసృష్టార్థముల లోన నే గణించి
యాసు పుట్టించి మలఁచు రతీసు నాన
నాత్మసృష్టపదార్థమ్ము లనుభవింప
లే పెరుల పెత్తనం బని లేమ దవిలి. ౩౮

ఒక లీలావన మందు నుల్లసిత పూ సెక్కొంగ డశోకంబు పా
దం బాలంబునఁ బాలపా న్వచట వన్నె న్వానిఁ గన్నట్టి నా
యకు పైచందము తా సుఖించు తన భాగ్యం బాత్మ నిర్మించి యో
పిక నేందీవరనేత్ర దా పుడుచె నీ విశ్వంబు నా ప్రేముడిన్. ౩౯

అప్పు డొక ప్రాణసఖి కౌమ ననునయించి
యెంచి లాలించి యెలపల్కు లంచిత మగు
వరున సాగించెఁ దచ్చిత్తభంగి మార్ప
భూతములఁ బలికించెడు పురుషునట్లు. ౪౦

నెచ్చెలులము కామా ? నీ
పచ్చిన యా వగకు వగలఁబడకున్నామా ?
ఇచ్చులు నిన్నుఁ గొలువమా ?
ముచ్చిక వో నేఁటివారమా ? మానవతీ ! ౪౧

ఉంటిమి తింటి మొకయెడఁ బ
రుంటిమి మనలో మనకుఁ బొరుపు లని కలవా ?
తంటాలు నీ వెనయు వా
ల్గంటీ ! మే మెట్టు లోర్వఁగల మవి వినకే. ౪౨

అయెం బోయెం గాల
వ్యాయామము సైపఁజాల మతిమస్స్పృహ మౌ
నీ యెడఁ బాపముఁ బాపక
మా యూన వచింపవలయు మర్మం బబలా ! ౪౩

మే లతకు వాడు గన్పట్టె శీల మేమొ
క్రొత్తక్రొత్తగఁ బేఁచె వాక్రువ్వ వింక
బెట్టు సిగ్గునఁ బొదలంగఁ బెండ్లివారు
వచ్చి వాకిట నిలిచిరే వారిజాక్షి. ౪౪

దయావతీ! సుఖంబునఁ బాల్గొను సఖులకు దుఃఖభారంబును బంచి పెట్టరాదా? గోలా! మాకు దాచిపెట్టి వాంఛిత మేసాధనాంతరముల నమకార్చుకొందువు? శుచిస్మితా! ముందు రొకసారి హాసరుచిఁ గను విందుసేయుము. మధురలోచనా! కడగంటిచూపుదేనియు నొకపరి సుమ్ము "తృప్తాస్మి" యనిపింపుము. పల్లవాధరీ! సంపల్లవభరితంబు లగు నీ వల్లరుల నవలోకింపవా? పోనిమ్ము. కలకంఠీ! ఈ కలకంఠకులముల పంచమకూజితము వినరాని దని నిశ్చయించితివా? అట్లైన మా నెయ్యంపుఁ బలుకు లాలకింపుము. ప్రాణసఖీ! నీ వెత కీ ప్రాణంబు లెంత కొట్టుకొను చున్నవో విచారించితివా? సుధాస్యందినీ! యీ సమయమున నీ రహస్య బోధామృతము నెనయుకున్న మా యసువుల కాన వదలవలసినదే. గభీరా! నీ దుఃఖసాగరం బెఱింగిన వీరలు తరు లగుదురు జు మ్మని సానున యమ్ముగను సరాగమ్ముగను సాకూతమ్ముగను సమాధుర్యమ్ముగను సఫలమ్ముగను సవిశేషమ్ముగను గా పలుకు సంగనఁ దక్కొరులు సనుగమింప నవ్వా రలు దురాసద మ్మయిన తన భావసీమఁ గ్రమింతురో యను భయమున సిగ్గు మొగ్గుగా నల్లిబిల్లిగ నిలువెల్ల నల్లియున్న తత్ప్రతిప్రవత్తిక తప్పించుకొనరాని బంధం బగుటయు నొక్కఁ పక్కిం గైకొని యక్కాంచ నాంగి సాభిప్రాయంబుగ నయ్యభిప్రాయజ్ఞలతో నిట్లనియె. ౪౫

ఒక కలిఁ గంటిరే వింటిరా? సకియలార!
ఆ మహాస్థలి మానససరసు కలదు
మానసం బను కాసార మా నెలవున
నునికిఁ బన్నామమున నన వెలయు సరసు, ౬౨

ఒకమాటయిన జవదాటక ధైర్యసారుఁడై
మను వివేకుఁడు మంత్రి యనుసరింపఁ
సర్వసర్వంసహాఽపూర్వవిశేషముల్
శ్రుతదృష్టముఖులు చారు లెఱిఁగింప
భువనమోహనకళాద్భుతవాకచక్యముల్
తనరూపు క్రొత్తక్రొత్తగ నమర్పఁ
పంచినసూత్రాన తలతల మను మనో
రథములు దూరమార్గములు ద్రొక్క
సకలసద్గుణతతికి నాస్థాన మనఁగ
నేలు నా సీమ నెల్లర మేలు గూర్పఁ
జాలి తనయాన యంగదేశంబువడకుఁ
గదిసి సరిఁబెంప బుద్ధిసాగరుఁడు విభుఁడు. ౬౩

అతని ప్రజానురాగం
బాతతసౌభాగ్యవిలసనాదివిశేషం
బాతనికె కాక కొండొక
భూతలపతి కెందుఁ గలుగఁబోవు తలంపన్. ౬౪

అనవారుగ నరిగి యతం
డనవద్యముని దృష్టచారుఁ డావృతిఁ దెలుపన్
బన తెనఁగు పురుషవిధ మౌ
వెనలకుఁ గొన రైన గొనబుపీవిం గనియెన్. ౬౫

ఆద్యునకు నయ్యుఁ దగ్గికి నగ్గి చందు
రునకుఁ జందురుఁ డింద్రునకును మహేంద్రుఁ

తనలోని విశ్లథత్వము సెంచు కరికరం
　　బేలిన బాహుమృణాలయుగము
తన మహానుభావతకు నోటువడు దేవ
రాయఁ డైన మ్రొక్కు రాజసమ్ము
తనదు బలగ మైన ధన్యుండు జనదృగ
బలఁ గలంచు టెంతపని ? లతాంగి !　　౬౬

అన్న బంగరు దమ్ము లమృతాంశుఁ గఱఁగుచోఁ
　　దమ్ముఁడు మోహనాస్త్రమ్ము గలిపెఁ
గొడుకు పూనిన పూన్కఁ గడు మెచ్చుకొని తండ్రి
　　చెలువందు తన రసౌచితి నొసంగెఁ
దన భర్తృవాల్లభ్యము నయించు నెఱి మించి
　　భార్య యఖండసంపదలఁ గూర్చె
నత్త యౌత్సుక్యమ్ము ననుసరింపఁ దలంచి
　　కోడలు తెల్వి పై కొసరు సేసెఁ
దోడికోడలితోఁ దులఁ దూగఁ గోరి
మఱఁదిపెండ్లాము తన గరిమం బమర్చె
నెపుడులేని కుటుంబైక్య మపు డొనర వి
రించి యా మోము మేల్మి సృజించె నతివ !　　౬౭

మఘవానూనవిభుత్వభాసి యగు న మ్మాన్యుండు గైకొన్నత
మ్మి ఘుమాయిం పపరూప మయ్యె నిపు డ మ్మే లెంచెదు న్నాన ని
ర్లఘుభావుం డవు వానివారి దరి జాలం బొందు గాన్పించె న
ద్ది ఘనుం డాతని నైంద్రజాలికునిఁ గాఁ దెల్పు న్వధూగ్రామణీ !　　౬౮

ఆరక్తాంతవిశాలనేత్రముల భాగ్యం బబ్జగంధీ ! భవ
త్తారుణ్యాద్యుపభోగలక్షణసుఖిత్వమ్ముం బ్రశంసించె నౌఁ
దారేశానుఁడుఁ గౌముదీరమణియుం దార్కాణ గా నెవ్వ వి
స్తారాశ్లేషసుఖంబుఁ గాంతు రనుచు న్నాముద్రికం బొప్పెడున్.　　౬౯

ఏ గొనంబున నతనికి నించుకేనిఁ
దీనివో విట్టి నీవు ద్వితీయ వగుదు
వంచు జగదేకలలితు నిర్మించునతని
వ్రాతలో నుండకుండునే వారిజాక్షి! ౭౦

అంతియే కాక యాతని హావభావ
ములు భవదధీనములుగ నేము దెలిసితిమి
సుగుణకల్పద్రుమం బనఁదగిన వాని
చిగురుమాటలు ఫలము సూచించుచుండె. ౭౧

అని తియ్యదనము మెత్తన
యును దోప రసాయనంపు టొప్పిదమున నూ
తనపరిమళము లొలయు వా
క్కున శ్రుతిపుటయుగము దన్పు కొమ్మల బోధణ. ౭౨

తదాయత్త మ్మగు చిత్తమ్మునకు గజగమనసుందరంబు గా నెదురగు నిజదయితు నుదయద్యౌవనానూనం బగు మేలిరూపు నంతర్గతమ్మునఁ గైకొని యమ్మనస్వివి ఆహా యి ప్పురుషరత్నంబు వర్ణింప నాకు శక్యమా? కా దని యూరకుందునా? ఏమిసేయుదు? ప్రతిభ నిజస్వభావంబు నుజ్జగించునా? ఐన దాని నందినంత యందుకొన నిచ్చెదఁ గాక. తొలు దొల్త ని మ్మేనఁ దరగ లిడునది దీర్ఘికయో సరిత్తో సరిత్పతియో విచారింప వలయు. పేరు గొప్పయే కాని యూరు దిబ్బ యనినట్లు మొదలిదాని కీ వైశాల్య మెక్కడిది? రెండవది యనునెడఁ బొడమునెడయుఁ జొరఁ బడునెడయుఁ బ్రస్పుటంబులు గావలయుఁ గదా? ఇఁక మిగిలిన దనిన నూషరక్షేత్ర మ్మనఁదగు నచ్చోఁ దమ్ముల యంద మ్మేది? కొందరు లావణ్య మందురు. దాని కర్థంబు మృగ్యంబు. కొంద అప్పదమున కర్థంబు ముత్తెములలోపలి చాయఁబోలు నది యని వ్యాఖ్యానము సేసిరి. పూర్వుల నిరాకరింపరాదు కాని నిరాకర మని మాత్ర మాత్రేవ విడువ నగు. ఇన్ని మెలికెలకన్నఁ బిడిచిన యన్నిరత్నముల రసముల తేట జాల్వారి పైఁగ్రమ్మిన యొక్క క్రొందీవి యనరాదో? శారదాభ్రంబుం

ఖురుడించు తెలితలపాగాయు మల్లెపూలచెండును రంగుమాఱ స్ఫురించు చున్న కేశము లక్ష్మీలంబునకుఁ జంకక నింకొక వకారంబునఁ బేరుమార్చు కొని తిరుగు కేశవునకు సజాతియమ్ము లనక తప్పదు. ఫాలఫలకంబుఁ జూచినవా రెల్ల మానినీమానసాకర్షణమునకు మారుఁ డేర్పఱుచుకొన్న యయస్కాంతశిలాతలం బన కుందురా? బహిఃపదార్థవిజ్ఞానార్థముగఁ మన మను కోటలో నున్న మీనకేతనుఁ డమర్చుకొన్న దుర్భిణియంత్రం బులో? బుద్ధికి మనక వేఁ బెట్టిన సులోచనమ్ములో? మొగముదివిలో విధాతృఁడు దాచికొన్న యన్నిరకము లగు తళుకుల పాతరలో? ముఖ కమలాకరమ్మున నపూర్వమ్ముగాఁ బొడమిన మువ్వన్నెతామరతేఁకులో? యనందగు నయనమ్ముల నూరక కమలమ్ము లని యనువారి నోరికి దారియు డొంకయు ననరాదు. రతిపంచబాణుల బాణాసనము లని బొమల నొడివెడు నుడువులలోనే పక్ష్మంబులఁ దుమ్మెదనారు లనిన కలిసి వచ్చునుగదా. ఆ రతితత్పతులకు సీమావిభాగార్థము ధాత నిర్మించిన హ ద్దన నుద్ది యగు నాన యను కట్ట తుది వారలు వెట్టుకొన్న సౌగంధ్యంపు బాదు లనఁ దద్వివరంబులు నందర్పంబు గల వై శ్వాసానిలములకు గంధవాహకత్వము నాపాదించుచున్నవి. యౌవనుని పంటచేలు నాఁ దగు కపోలచిబుకాదిప్రదేశంబుల వాని చల్లకమున మొలిచిన శ్మశ్రులపేరి సింగారంపుమొలకలకుఁ బోయు తోయముకొఱకు నిర్మించిన దిగుడుబావు లన వీని వీనులు సంస్తుతము లగుచున్నవి. ఆమ్మకచెల్ల ప్రతిబింబంబు నకు బింబం బనఁదగి నుత్తమం బయ్యు నధరం బను పేర వినయంబు నయించు నధరమణియు దాని కనూన మ్మగు వేఁడిమి నిచ్చి పుచ్చుకొను రదనాపరపర్యాయమున నొలిచిపెట్టిన దానిమ్మగింజలు నొక్కచో నుండ నయ్యెడ విడిచి పెడదారి నడుగిడు దౌర్భాగ్యమ్ము వెడవిల్తు చిలుకతేజీకి నెన్నిజన్మంబులకునుఁ గలుగునే కలుగదు. వీని తెల్లని చిర్నగవుతేట నీలాలకల హృదయదేశంబుల దాగరసప్రవాహ మగుట యనుభవసిద్ధ మైనను న్యాయశాస్త్రపుధోరణిం జేరదు. లావణ్యక్షీరవారిధిలోఁ గరుడు గట్టిన మొగం బను శంబరవైరి మేడకు నాధారం బగు మెడ యను నొంటికంబంబుఁ గం బని మొదట ప్రతిష్ఠించిన శంఖంపు భ్రాంతిం బలుకువారు కవులు గారు. ధ్వనింబట్టి యట్టు లూహింపకున్న నిం కెట్టు

లైన నూహింపరాదా ? రాజగృహద్వారంబుల మాంగళికవాద్యఘోషంబులఁ బ్రత్యక్షంబుగా వినుటలేదా ? యౌవనుఁడు బంతులాడుకొన గట్టిసేసికొన్న కుట్టిమస్థలమ్మో ? యనంగుని బహిరంగసభయో ? రతివసతియో ? ధైర్యమ్ము నిక్షేపమ్మో? స్థైర్యమ్ము స్వరూపమ్మో? విలాసినీ విభ్రమపరీక్షైకప్రయోజనకమహాదర్శవిశేషంబో? నాఁ దగు నురస్థలమ్మునకు నిరుడెనల మొలిపించిన శాఖులో ? సువర్ణశయకుశేశయముల కాధారము లగు కాండములో ? మదనప్రభు ప్రోల బరాబరులుచేయు చారులచేతి కఱ్ఱలో ? యున నవ్వు బాహువుల నెం తని వర్ణింతును. విధి యఱచేతులఁ దుడుచుటచేతనో ? నున్ననగు ప్రక్కలు పటికంపుఁబలకల. ఉదరంబు త్రిలోకి సౌందర్యన్యాసస్థానంబు. పిఱుఁదులు స్వల్పబుద్ధుల ప్రయత్నంబు లేమో ? ఊరువులఁ గరికరంబు లనిన నెబ్బొరికంబు నసంభవంబు నగుఁ గాన సౌభాగ్యంబు కొటారు లనఁదగు. జానువులు భర్గవైరి దుర్గంబులు. జంఘలు సుమబాణు తూణీరమ్ములు కాకున్నఁ గొన్ని యళిపక్షంబు లచ్చోఁ దోఁచు టేలకలుగు ? గుల్ఫమ్ములు సౌందర్య ద్రవిణపేటికకు వైచిన బీగమ్ములు. కఠినకమఠకర్పరంబుల నుదకములంబులఁ బల్లవంబుల నతిమృదులములు నచ్చములు త్రిభువనోపాస్యమ్ము లగు ని మ్మహాత్ముని యంఘ్రులతోఁ బోల్చెద మనువారి ప్రతిభ ముదిసనది. సాముద్రికసారమహాభాగ్యముద్ర లని నే ననుకొనెద. వ్రేళులు రాగమహీరుహైకాగ్రమంబులు. నిజదీప్తిప్రభావంబున నఖంబు లని బిరుదులార్జించిన గోళ్ళ మారుఁడు నారులఁ జీర నూఱిన మచ్చుమందు రంగువాయని చిరుసాన లనవచ్చు. ననుచు నే మేమొ వర్ణింపఁబోయి తలకడచిన రతి యావేగంబున మూర్ఛవోయి చెలుల యుపచారంబుల మేలుకని యుత్తెఱవ సిగ్గు మఱచి మరునిగుఱిచి యి ట్లనియె. ౭౩

ఏరా మన్మథ! నీ త్రిలోకజయ మే యేట న్మానింగెం ద్రపా
దూరస్థుండవు గాన గెల్వవలె మా దుర్గాకటాక్షమ్మునన్
నీరై పోయిన ప్రాణము ల్కుదుట నుండెన్ నీకు నిందాఁక నా
వేరం బింతకుఁ దెచ్చె నిన్నుఁ దగ వున్నే నీకు నీ సానికిన్. ౭౪

భీమారుంతువలోచనాగ్నికణికాభీతుండ వై నాఁటితో
స్త్రీమధ్యంబునఁ జొచ్చి హెచ్చి మగవారిం జేరఁగా జంకు నీ
సామర్థ్యంబున కిన్ని గచ్చు లివి నీచత్వంబుఁ జాటింపవే
రామారామబిడాలదుర్లలిత! మారా! నీరసాడంబరా! ౪౫

నీ వన్న నొక్క లెక్కయె?
బావఁ జదుకఁ దిట్టరావొ? చానలు ము న్మ
న్నావేగ మెనయ రెదిరిన
నావలఁ ద్రిప్పంగవనమె యబ్బకు నీకుఞ్? ౪౬

అనుచు మదను గదుము నాలోన సునిశిత
ద్యుతిచయంబుఁ బఱపి ధృతి నడంచు
శీతభాను నెరికి వాతెఱ గంపింప
సువతి యనియె వాని జురచురఁ గని. ౪౭

అత్రినయనమునఁ దోఁచితి
వా త్రినయను నెత్తి కెక్కి తంతియ కా దా
గోత్రాదివిజేశుఁడ వై
మిత్రాదివిశేషయుక్తి మెఱసితి చంద్రా! ౪౮

ఆ చిన్నతనపు గారవ
మీ చెన్నున వోవ గురుని యెలనాగకుఁ గా
నీచుఁడ వై లోకమ్ముల
నా చక్కటి నడపఁజూచె దగు నగుఁ జంద్రా! ౪౯

బీరంపుఁబలుకు లేటికి
మారునిఁ గాలిచిన కంటిమంటయ నిన్నుం
జేరి కమల్చిన గాయము
నేరంకువొ యనుచు మాటి తెఱుఁగమె చంద్రా! ౫౦

పుట్టినచోటిగొనమ్ములు
గట్టా చదివిన నయము లోకానొకఁ డేనిం
బట్టవ సహపాఠిశిరం
బట్టె మిగులఁ జదివి తెనిమి దాకులు చంద్రా! ౮౧

విరహులను జంపు పని కై
యురగమ్ముల సోట దూఱి యొరవెడలి వే
పరుగులిడు దఫలముగను నీ
వరమార్థిత దెలిసె మలయపవమానుండా! ౮౨

వారలను వీరలను జేరి పవలు రేయుఁ
జెట్లచేమలపా లై కసిఁ గొనియాడె
దకట లాభంబు లేదు కానంత నీకు
నొరులు మెచ్చరు నీసంత యొవనంత! ౮౩

అని మఱిమఱి య య్యనంగు నంగమ్ముల నుపాలంభించు నయ్యంగనం గని కమలిని రాజహంసంబు డం బాసించుట కానిపని కాదు. అతండు నిర్వీటన విడిసెంగదా. వాని మానుసులదరి జాలంబు మనకథ కనుకూలంబ. యెల్లి యెల్లవిధంబుల మే లయ్యెడు. మింక విశేషములు నరయు దము గాక యని యాలలన లానవలారతనంబు లాలించి యంచిత శాఖాంతరంబునం జేర్చి యిష్టగోష్ఠుల సావధాన లై తదిష్టం బనువర్తించు చుండి రంత. ౮౪

కోపన కోపాతిక్రమ
మే పాపముఁ గూర్చునొకొ యా మేని కటం
బా పంచశరుని మామయు
మాపు నగము మిగులఁ బశ్చిమపథం బెనసెఁ. ౮౫

విభుని వలవంత

ఆ నడురేయి విలాసో
ద్యానమునం దొనరు మంటపాంతరమున భ
వ్యానేకసుమానంజిత
మైన మణీవేది మంచికాగ్రతలమునన్. ౧౬

మనమునం బుట్టువానికి ఘనపథంబు
పైనఁ జెల్లాడువానికిఁ బగఁ గొనియును
నేమియుం జేయనేరక హృద్యుఁ డొకఁడు
తిట్టఁదొడగెను గసిపోక బె ట్టిడలఁగ. ౧౭

చచ్చినవారికిం గలపె శౌర్యపుమాటలు నీయెడం గనన్
వచ్చెను గాక సర్వజనవంద్యులకుం జనియించి తే గతిన్
బ్రుచ్చుదనంబు వక్రగతి క్రూరత యబ్బెనొ ? మామ పోల్కి నీ
కచ్చునగ్రుద్ధి న ట్లినయనయ్యెను గాక ? శకారలాంఛనా ! ౧౮

ఆ గంగాతటిఁ గంటిమంట కెదు రౌన ట్లీ ముఖాలోనికిన్
రాగా వీల్పడకుండ మామ నిడి నీ రారాపు గాఱింప నై
వేగం బైకొను గాలి జుఱ్ఱుకొనఁగా విఖ్యాతనాగావలి
న్మేఁ గిల్కొల్పిన చండికేశు పగ కేమీ తప్పిపోతే ? స్మరా ! ౧౯

అల్లుఁడు పిశాచ మౌఁ గా యనంగుఁ డగుటఁ
జంద్ర ద్విజపతి వీవు నిశాచరుఁడవు
మీకుఁ దోడయ్యె నొక గాలి యీ కువలయ
మందు బ్రదుకుదు రిం కెట్లు కొందఱైన. ౨౦

అరరే మీరు సుధాశన
పరిగణనమునందుఁ జేరువా రవుట నెటున్

మరణంబు లేదొ? రుద్రుఁడు
పరిపక్వము సేయు మఱొకపరి యెదు రైనన్. ౯౧

అనుచు నంతంత కగ్గ మౌ నలరువిలుతు
నక్కలికిఁగోలుతలకును వెక్కసపడు
వాని ధోరణి విని కొంతవఱ కెఱింగి
వెత వెలార్పంగ వచ్చెఁ దద్విహితుఁ డొకఁడు. ౯౨

వచ్చి యిష్టగోష్ఠి వర్తించుచో ననె
స్వామి! మీచరితము సాము దెలిసెఁ
దక్కనదియుఁ దెలియదా యేమి? యటు లుంచు
మది యిది వినుమా సమాదరమున. ౯౩

ధీవరు లుండెద రీ పురి
నా వర్షము నెల్ల నేలు నధిపతి సుగుణుం
డేవేళ నేమరఁడు శివు
నావిభునకు నొదవెఁ గూతు రా పున్నెమునన్. ౯౪

దాని వర్ణింపరాదు మా తల్లిగానఁ
గాకయున్న నలవికాదు వాకులకును
దీనిఁ గైకొన నెంతటి ధీవరుండు
రావలెనొ? తల్లి యెందుండి రాణ పెనఁగ. ౯౫

ఆ నలినాస్త్రుఁ డన్నుఁ దన యంగము సంగతి వాసె మున్న పో
నీ నలకూబరుం డనిన నేరుపు వేశ్యకు వెచ్చగించె రా
జానన నేల దీ టయినయాతఁ డెవం డని సంశయించు మా
మానసమందు ని స్గనినమాత్ర విధాత్రుడు నిశ్చయించెడిన్, ౯౬

చంద్రికాచంద్రులకు నున్న సామరస్య
మద్రిజాతాగిరీశుల యైకమత్య

మనుగతము లగు నాయమ్మ యాకృతిఁ గని
నిన్నుఁ గనుఁగొన్నవారల నెమ్మనముల. ౯౭

భవవక్షప్స్రితంబు భావిని వలగొన్న
వడువు దోఁచె మాటవపున విసఁగ
నైన గోభసంబ యంతవ మొక్కండు
కలచు కొమ వరింప ఘనుఁడ! వినుము. ౯౮

జల మున్నుఁ జేప లుండవె?
బల మెక్కుఁడు గలిగియుండు వాహినులందుఞ్
నలిలాకరముల నంతకు
నలఘుతమము లుండు జలధియందు నెఱుఁగమే. ౯౯

అది కాదు నేఁటిపద్ధతి
యెదియే స్ఫూతంబు మీనునేడ్తెఱఁ జొచ్చెఞ్
జిదురుపలు సేసెఁ బడవల
నువధిం జొరనీయ దెట్టి యోధులనేనిన్. ౧౦౦

పంచలు వేలున్ లక్షలు
నుం దరు లంబునిధిలోన ను గ్గై తొఱఁగెన్
ద్రుంచిరి తూలిరి వర్తకు
లుం దజ్జీవనులు దాశులున్ బెడిసచేన్. ౧౦౧

వారిధిలో నేమూలనొ
సౌరూపం బింతఁ గాంచెనా రయపూరం
జేరి యొకతాఁకు తాఁకి వి
దారించుఁ బ్రమాణ మీవ తత్త్వము విన్నన్. ౧౦౨

మూడక్షరములు పలికిరి
మూడవువర్ణంబువారు మూలధనంబుల్

మాడలు నోడలు నమసిన
నేఁ డా రెం డక్షరము లనిరి ధీవరులున్. ౧౦౩

వర్తకము సెడుట తన యను
వర్తను లటు లేమిఁబడుట వగఁ గూర్పఁగఁ గై
వర్తపతి ప్రతిన సేసెఁ గొ
మార్తె నిడుదు మీనుబట్టు మహితున కనుచున్. ౧౦౪

ఆతఁడు మాటతప్పఁడు మహాత్ముఁడు నీ కులగోత్రరూపరే
ఖాతతవైభవంబులు మహార్హము లైనను మీనుఁ బట్టకే
చేతికిరాదు నాతి మరు చేతికిఁ జిక్కతి వీవు గా దనన్
లాతివె పూను మాపనికి లాభము ఖ్యాతియుఁ బున్నె మయ్యెడున్. ౧౦౫

అను నాఘను మినుకులు వినుచుండగనే గఱుపాయ మేన నావేశము వచ్చినట్లు క్రోధమో సముల్లాసమో యుత్సాహమో సాహసమో పొంగార మద్వృత్తుండై యల రారుచు. ౧౦౬

పట్టెద నల మీనవతిన్
మట్టెద జలనాథు వాని మానుసులం జే
పట్టెద నామీనాక్షిన్
గట్టిగ గా దన్నఁ బుడమిఁ గడలిఁ గలుపుదున్. ౧౦౭

ఎం తైనఁ జేయఁదగు నా
యింతికిఁగా నింతమాత్రకే జంకుదునే ?
పంత మది యట్టు లుంచుము
సుంత వినుము కాంత వింతసొబగు కుమారా ! ౧౦౮

తనవదనశ్రీలఁ దనిసి యప్పుల పాలు
నై నిక్కనికి చూచు నంబుజములు

తననయనశ్రీల నెనసి కానల కేగి
రాకుండ మసలిన రౌహిషములు
తనచపేటశ్రీలఁ గొని దుర్మతిఁ బలాశి
పద మాశ్రయించిన పల్లవములు
తనశరీరశ్రీల మని పవ ల్వాడి రే
ల్వికసించి లలిమించు వీరుధములు
కంప మంద భీతిఁ గలఁగి పాఱు మొగంబు
జేవురింప నొమఱఁగ సిగ్గుఁ జెంది
తలలు వంచికొనఁగ నిలువరించు నొకర్తు
గఱిత శ్రీమతి వనిఁ గంటి నేఁడు. ౧౦౯

తన పుట్టుప్రొద్దునఁ బెనిచె నవ్వుల రాజె
యగుగాక చక్రము లలరునొక్కొ
పరిపాలితానిత్యబౌద్ధము ల్కుముదము
లగుగాక శ్రుతుల మే లరయు నొక్కొ
ఆత్మమిథ్యావాద మధిగమించె ననంత
మగుగాక చనుమేర లమరునొక్కొ
మొదలు పంకమునంద పొడమె సారసములె
యగుగాక సాంగత్య మందునొక్కొ
యనుచు వెక్కిరించు నందఱఁ బేరెత్తి
పిలిచి లలిత మొగము కలికికనులు
నడుము పదములును జనన మాది సిరిమించు
వారి కెందు నది స్వభావమె కద! ౧౧౦

ఆ సౌందర్య మనంతవాగ్విషయమా? కాదు. ఆ హావస్వభావస్ఫురద్భాసశ్రీయు సహస్రనేత్రపరిదృశ్యంబా? కాదు. ఆ సద్గుణంబులు సహస్రకరకరపరిలేఖ్యంబులా? కావు. అసదసద్విలక్షణసుమధ్యతో సురోర్వీనాథయోషామణులు పీనం బెత్తున కైన నెత్తువత్తురొ? వట్టిమాట. ఆ యలివేణి వేణిసిరి కాగక పాఱిన కళిందకన్య మధురానంగతరంగంబుల

యొప్పున మెప్పుఁగాంచె. ముంగురు లంధతమసాంకురమ్ములు. ముఖ చంద్రుం డత్రిముని మానసమునన యావిర్భవించె. బొమలు నిరుపమ ములు. లోచనము లాసేచనకములు. నాన చంపకతిలకుసుమనిరాసం బొనరించుచున్నవి. శ్రుతులు పలుకుల కందుట లేదు. ఓష్ఠంబు నధర బింబం బనుటకన్న నాకలోకబింబం బనిన భుటితిస్ఫురితార్థం బగు. కపోలపర్యాయపదంబు లేవియు నా సంస్థానముల నంగతార్థములు కాకున్నవి. చిబుకంబు ముఖకమలకందంబు. గళరేఖలు త్రికత్రయీ విజయరేఖలు. బాహువులు మరు నురిత్రాళ్లు. శయమ్ములు కుశేశయ మ్ములలోని సారాంశమ్ములు. కుచమ్ములు హృదయమ్ములోని ధైర్య స్థైర్యమ్ముల పిలకలు. మధ్యమిథ్యావాదమాశ్రయించినవారు రోమరాజిం గని యాస్తిక్యంబు వారిం బడఁగలరు. పార్శ్వభిత్తుల నంగతి యట్లుంచి యగమ్యగోచరం బగు నాభిని నీచం బనరాదు. నితంబము కాంచీదామ బద్ధం బైనను సర్వాతీతం బగుచునే యున్నది. అంకము లసంకములు. పిక్కల సౌభాగ్యంబు పిక్కటిల్లుచున్నదియు. పదక్రమములు వేదవాదు లెఱిఁగికొనవలసినవియు. ఇది సంగ్రహము. ౧౧౧

బ్రహ్మముఖ్యు లైన పరమకవిశ్వరు
లుప్పుట్టినపుడ యిటియు మొదలువెట్టి
యాప్రలయము విడక యభివర్ణన మొనర్ప
సాంత మగునె యింతి కాంతి కలన. ౧౧౨

దానిఁ జూచినాఁడ దారిలో వనమందు
నంతనుండి స్మరుఁడు వంతఁగూర్చె
నీవు చెప్పినదియు కావచ్చు నద్దాని
వెంటనంటి వచ్చి కంటి నిన్ను. ౧౧౩

సారనసారగంధి ఘనసారకుచద్వయవప్రగుప్తచే
తోరమణీయదుర్గమున దూరిన మారుసిఁ బట్ట శక్య మౌ
నా ? రతి వాఁడునుం గలిసి యచ్చటినుండి విదిర్చు నమ్ము లో
రా రయమార నేత్రవివరమ్ములనుండి వెలి న్వెలార్పఁగఁ. ౧౧౪

అని యాతం డనుచుండ ననుచరుండు స్వామీ! దీని కింత యేల? ఆ ధీపదు ప్రతిజ్ఞకు సుధీవరుండ వగు నీప్రతిజ్ఞ సాధకమే కదా. యది కల్యాణసాధక మని వేఱ చెప్పనేల? ఇదె వేఁగవచ్చుచున్నవి. మీ యుభయ ప్రతిజ్ఞాపూరణమున లోకములు కల్యాణపరంపరాభివృద్ధి నెన సెదు మనుటయు. ౧౧౩

జారచోరవితతిసంగతి రే యెల్లఁ
గన్ను మూయకుండఁ గలఁచితి జగ
మలసి సొలసె దేమొ? అపరాద్రి చరియపైఁ
బండుకొనుము రాజ! పండుకొనుము. ౧౧౬

అని యాయిద్దఱుఁ గర్తవ్యంబు జాడఁ బ్రవర్తించి రనిస జ్ఞాననిష్ఠాదు లావలికథాంశంబు విన వేడుకపడుటయు. ౧౧౪

నిష్కామకర్మకరణా
విష్కృతనిజతత్త్వవిత్త్వ! విజ్ఞానఘనా!
దుష్కృతిదూరకథా! శో
చిష్కోపానప్రసిద్ధశ్రీతా! ౧౧౮

వీతదోషగుణ! విశ్వజనీనా!
ప్రోతసత్త్వధృతిపూర్ణవివేకా!
నీతిమార్గపరినిష్ఠితచిత్తా!
నాతిమాత్ర విధృతాత్మభృతీచ్ఛా. ౧౧౯

ఇదిశ్రీమద్రామకథాఽమృతకవికుమారహనుమాంబాశమీగర్భహవిర్భరాయ మాణ శ్రీదేవీసేవ్యమాన రాఘవనారాయణాభిధాన కవి గ్రథితం బగు కల్యాణకైవర్తకం బను ప్రబంధంబునఁ ద్వితీయాశ్వాసము. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# కల్యాణకైవర్తకము

## తృతీయాశ్వాసము

శ్రీవృతవేంకటసుబ్బాం
బావల్లభపిచ్చయాద్యమహిత కుమారా!
శ్రీవృత! వేంకటసుబ్బాం
బావల్లభ! పిచ్చయాద్య మహిత కుమారా! ౧

ఆశ్రుతం బొనర్పు మతివినీతుం డవు సూతుం డ మ్మునుల కి ట్లనియె. ౨

వికచసహస్రపత్రవనవీధి విహారముసేయు వాయుశా
టకు నుదయమ్మునన్ మరలఁ బొల్పడు దంపతుల న్ఫలించు ద
ర్పకు నతిదర్పవైఖరికి రంజిలు నోములు నోమకుంటచే
నకటకటా కళానిధి యహర్పతి తేజము నెంచి పాఱుచోన్. ౩

మదనుని సాయకారి యధమద్విజపాలకుఁ డబ్జినీమనః
ప్రదరము చక్రభేదకుఁడు రాత్రిచరుం డవు గౌరుతల్పకుం
డిదె చనుచున్నవాఁడు భయమెంచి యహస్కరు రాకఁ గాంచి యం
వదరుచు నార్చెఁ బేర్చి చరణాయుధముల్ చపలస్వనంబులన్. ౪

మూపుకడ మున్న మే ల్కాంచి మగనిఁ దెలుప
ప్రాఙ్మహీధరరమ్యహర్మ్యమ్మునందు
శచి మొగమ్మునఁ బెట్టిన జమిలిచిట్టి
బొ ట్టనఁగ వేఁగుఁజుక్క యభ్యుదిత మయ్యె. ౫

పులుఁగుల పల్కు లెంచి నిజపూరుష నిద్ర గణించి ముద్దితం
దలఁచి కడంగఁబోయి కరతాడనముం బొనరించి సత్వముం

గొలుపు వయస్య నంజ్ఞఁ గొని కొంకున వే గదివాయు ముగ్ధకాం
తల ముఖబింబ మట్టు లుడునాథుఁడు మిక్కిలి వెల్లనయ్యెడున్. ౬

మెఱుఁగుతారక లురలఁ ధమీభుజంగు
వసుసమృద్ధియుఁ దులకించు పసయుఁ గ్రోలి
జాఱిపోయెడు నంశుకజాల మొప్ప
స్వగృహ మెనసిరి వేశ్యలు శర్వరియును. ౭

పద్మినిం గొను నప్పు డప్పతిని సైత
మిదె హరించెద నని రాగ మెనసి యుదయ
మందెఁ గల్యాణమూర్తి తిగ్మాంశుఁ డార్యు
లవనతులతోడ నర్ఘ్యపాద్యమ్ము లొనఁగ. ౮

ఐంద్రి విమలాస్య గా స్నాన మాచరించి
కాల్యములఁ దీర్చి శతయజ్ఞకర్త యౌప
నమ్ము హోమమ్ముకై జ్వాల నలుపు జ్వలన
కుండమో యన నహిమభానుండు వెలిచె. ౯

తులువల నెత్తి మొత్తి తనతో నరి గా గమకించు రాజున
జ్జలనిధి పా లొనర్చి కరనంపదఁ గూర్చి జగజ్జనంబులం
దెలివికిఁ దెచ్చి శత్రుల విదిర్చి తలిర్చుటఁ గాంచి కాంచె న
న్నలినవతీలలామ దన నాయకు పేర్మి కఖండసౌఖ్యముల్. ౧౦

అల కొక్క యాకార మనువారఁ జేరిచె
నెన్ని బింబము లింక నున్నవియొకొ ?
చిటిచిట్టి వెలుఁగు లొక్కొటి కొక్కొటి కమర్చె
లెక్క వెట్టఁగరాదు లేఖులకును
నారనమ్ములఁ బోని భూరిమయూఖము
లున వేయికరములఁ దానుఁ బూనె

సల్లకల్లోల మై యబ్ధి ఘోరుకొనంగ
నింగి నంగతుఁ డయ్యె నెఱసుగఁటిమి
నెన్ని నాళ్లనుండి యీ సాము నేర్చుచు
న్నాఁడొ నేఁడు చూడ నలినబాంధ
వుండు గండుమీను గం డడంచి జగంబు
నేమనేమొ ? యనెడు యుక్తి దోఁచె.

దాశకన్యాస్వయంవరార్థమ్ము కాదు
కాళ్యపున కింత పూనిక ఘనతకొఱకు
చేఁపలం బట్టఁ బోక విశిష్టధర్మ
మా ? యనిన కా దదియు నైజ మయిన ప్రకృతి.

ఆచ్చోటికి విచ్చేసెం
బొచ్చెం బోక యింత లేని పూరుషవరుఁ డా
నెచ్చెలికాఁడును దో డై
వచ్చుచునుండంగ నమయవర్తన కగుచుణ్.

వాసిగా మెయినిండఁ బూసిన బసుమంబు
తన వీరశైవవ్రతంబుఁ దెలుప
నెడఁద ముక్తాహార మెడపడఁగ స్ఫురించు
రుద్రాక్ష లా భద్రముద్ర నొడువ
నారువింజల కొమ రమరంగఁ గట్టిన
తెత్తిదువ్వలువ తేట దెనల మునర
నప్పటప్పటికి శివోఽహ మ న్పలుకు లు
పాననావైశేష్య మనువదింప
నఖిలనద్గుణజాలంబు లమరు కలిమి
తన మహాద్భుతధీవరత్వమ్ము నెఱుక
సేయఁ నచ్చోటి కేతెంచె స్వీయులఁ గొని
ధన్యమూర్తి సుధర్మాఖ్యదాశవరుఁడు.

వల లూఁతలునుం బగ్గ
మ్ములు జాలెలు గాలములును బుట్టలుఁ గొని ప
ల్లెల వార లెల్ల వచ్చిరి
చెలువుగఁ బిల్లలును దారు చేడె లచటికిన్. ౧౫

చేపం బట్టఁగ వచ్చెనట్టె యొకఁడో సింగారముం బీరమున్
రూపై వచ్చినయట్టు లా యనఘు నా రూపంబు నా నేరుపున్
జూపుల్ గ్రోలఁ గృతార్థతం బొరయ నోఁ జు మ్మంచు నొక్కొమ్మడిన్
బాప ల్బాపులు నన్యులు న్నడిచి రాపై గుంపు లై గుంపు లై. ౧౬

చోద్య మనుచుఁ జూడ సద్యోగు లుద్యోగు
లనక వచ్చి రఖిలజనవితతులు
నేమి చెప్పవచ్చు నిటు చూచి యటు చూచు
నంతలోనె నిండె నబ్ధి తటము. ౧౭

అది మహోదయంబొ యర్ధోదయంబొ నా
నయ్యెఁ బ్రజలఁ జూచి యబ్ధి పొంగె
నబ్ధిఁ జూచి పొంగె నఖిలజనంబును
బొంగి పొంగి యొక్క భంగి కయ్యె. ౧౮

అప్పు డప్పురుషమిత్రుం డగు కుమారగుప్తుండు విదితుం డగుట నందఱఁ
జేనన్న గూర్చుండ నియమించి తత్సమయవిశేషదర్శనశ్రవణకుతూహల
మ్మున నిశ్శబ్ద మ్మై యున్న సకలజనమ్ము విన నుచ్చైస్స్వరమ్మున
నమ్మహితుం జూపి సుధర్మున కి ట్లనియె. ౧౯

మహి కలంకార మౌ మధురాపురమ్మున
వరలెడు నొక్క ధీవరవరేణ్యు
పున్నెమ్ములు ఫలింపఁ బొడమినతఁడు వీని
భవదేవుఁ డని దివ్యవాణి పలికె

రూప మిట్టి దటంచు నా పనియా పల్కు
టదియు మీ చూపుల కెదుర నుండ
బల మన్నఁ ద్రిభువనంబుల నెంతవారికి
నలవికానిది వీఁడె యనువృషభుచుఁ
బ్రభవుఁ డరువదినాల్గు తంత్రములకేని
విభవమున కా కుబేరుండె విస్మయవడు
నేఁడు నీ సుతను వరించు నీరధిఁ గల
చేప రూపైన భూతంబు చేవఁ బాపి. ౨౦

భువనభయము వాయఁ బూనినాఁ డిప్పని
నిందు నీ పనియునుఁ జెందియుండెఁ
గాన నీ ప్రతిజ్ఞ కలవారు వినునట్లు
పలుకు మొక్కసారి ప్రభుఁడ! యనిన. ౨౧

పాడిన పాట గాదె? జనపాళికి విశ్రుత మయ్యె నింతకుఁ
నేఁ డయినన్ వినుం డదె యనింద్రితసద్గుణజాలుఁ డీతఁ డీ
నాఁ డిదె లోకబాధక మనం జను మీనపతిం గ్రహించి యీ
రేడుజగంబు లెన్న భ్రమరీదృశ నా తనయ న్వరించెడున్. ౨౨

అని యతఁ డాడునప్పటికె యంగము లెల్ల గగుర్పు నైన యా
తనిఁ గని కౌఁగిలించి జనతానుత! నీ కిది యొక్క లెక్కయే
ఘన మగు నీదు జాలమును గా దన నొందు జగంబు గల్గునే
పనిఁగొను మంచు వల్కుటె యపత్రపఁ గూర్చెడు మాకు నీకృతిన్.

కొనుమయ్య నీదు వాగురఁ
గనుమయ్యా కడలిలోని ఘనమీనముఁ జే
కొనుమయ్య స్వత్వసిద్ధిన్
మనుమయ్యా భవల్లతాంగి మన్నన కగుచున్. ౨౪

అతని ప్రేరణ మెనసి య య్యబ్ధిజలము
లందు నడుగిడె వాఁడు మహాజనంబు
తన్నుఁ గని వార్ధిఁ జూచి కృత్యమ్ముఁ దలఁచి
ధీవరు ప్రతిజ్ఞ నిందించు దెనకు సాగ. ౨౫

నరనాథాగ్రణి మున్ను వింటఁ గొడివెళ్ నారాయణాస్త్రమ్ము ధీ
వరనాథాగ్రణి యేమి సేయునొకొ కోపం బెత్తిన న్నేఁడిఁ కే
కరణి న్నీని యనుగ్రహంబు వడయంగా నౌ నొకో? యంచు నా
నరిదీశానుఁడు కంప మందెను మహాశ్చర్యంబుగా నత్తఱిన్. ౨౬

ఆ భవదేవుఁ డట్లు తన యాపములోపల నిల్చినంతనే
ప్రాభవ మొప్పఁగా నెదురువచ్చి తరంగకరాళి మ్రొక్కుచున్
వైభవ మెన్న నీరనిధి వజ్రముఖాంచితరత్నజాతమున్
బ్రీతయుయుక్తిఁ గాన్క లిడు నేప్పునఁ జెందె స్మితప్రసాదమున్. ౨౭

నరమమణిప్రసాదనహసాస్ఫురదాత్మతరంగసైకవ
ర్ణరుచిరతాత్మభోజనమనఃకలితభ్రమవారిజీవబా
హిరసవిలాననల్గనము లేమి వచింపఁ దగున్ రుచింప వే
నరసులకున్ మహార్హగుణసాగరు మ్రోల సముద్రవైఖరుల్ ౨౮

భవదేవుండును భృత్యు లిచ్చు వల భావస్ఫూర్తిఁ జేపట్టి వి
ప్పి విదిర్పం గడలేని కాంతి తతి పృథ్వీవ్యోమమధ్యస్థలం
బవరోధించి మహేంద్రజాలమునఁ జిత్రాకారతం గప్పినన్
బవలున్ రేయియుఁ దోఁచకే సకలజీవశ్రేణి మూసెం గనుల్. ౨౯

అవలలోని చిత్రమొ? మహాత్ముని యద్భుతహస్తలాఘవం
బో? వెతచూపునం గలుగు మోహమొ? యూహకు రాదు కాని ము
న్నా వనరాశి నెల్లెడల నాక్రమణం బొనరించి మించు యా
దోవితతిం గ్రహించె నది తీరవుయంత్ర మనంగ నొక్కటన్. 30

అఖిలసలిలజీవనావళి యా వల
మేను సోఁకినంత మిక్కిలి యగు
నిద్రఁ జెంది కదలనేరక సుఖ ముండె
నేమి మాయయొక్కొ ? యెవఁ డెఱుంగు ? ౩౧

## ధీవరుఁడు చేపం బట్టుట

క్రమందింపంగ దమింపఁ దప్పిచన సరంభంబు గావించి యే
నందున్ లేమి "నమశ్శివాయ" యని నిశ్వానంబుతో మీను తే
జుందర్పంబు జెడం గను ల్మోగిచి తా సోల న్వెనన్ లాగి యా
నందం బంది యతండు దాని నొడిచెన్ దైవప్రభావంబునన్. ౩౨

అట్లు తివిచి యొడిచి యమ్మత్స్యరాజమ్ము
నవని వైచి మిఱిలినట్టి జంతు
జాల మఖిల ముదధి జలముల విడిపించి
జాల మెల్ల ముడిచి చక్కవెట్టె. 33

చిత్ర మ్మయ్యెను నీచరిత్రము మహేశీనాథ ! శాపక్రియా
విత్రస్తు న్నవదీయు దాసుఁ గరుణావీక్షాప్తి రక్షింప నీ
గాత్రం బీ గతిఁ దాల్చి వచ్చితె ? యివే కైమోడ్పు లర్పించెదన్
స్తోత్రంబు ల్వొనరింప నేరిచెదనే శ్రుత్యర్థపాదప్రభా ! ౩౪

తొలిజన్మమ్మున నిన్నుఁ గూర్చి తప మెంతో చేసితిన్ దానికిన్
ఫల మీనాఁటికిఁ గూడ నీ కరుణ నాప్తం బయ్యె లేకున్న నా
జలజంతుత్వముఁ బోవఁద్రోవ నిటు వేషం బొందు గల్పింప ని
శ్చలతత్త్వంబవు నీకు నేల ? జగదీశా ! కేశవాద్యర్చితా ! ౩౫

వందనము ల్వొనర్తు సురవంద్యపదాంబుజ ! నన్ను మున్న యా
నందిని జేసి తియ్యెడ మనఃప్రియ మెయ్యది ని న్వరింప నా

కుం దయసేయుమయ్య! కృపకుం దగు పాత్రమ నేనిఁ బూర్వపుం
జందము దాన లోకముల నన్నుతి కయ్యెద భూతభావనా! ౩౬

అని యేమేమొ వచించు మత్స్యపతి యాస్యంబందుఁ గన్పట్టు గ్రం
ధనికాయం బెడలించి యందుకొని మోదం బందుమా యింక నీ
దు నివాసంబున నంచు నాన యిడు నా దుర్జ్ఞేయు నంఘ్రిద్వయిన్
వినతు ల్గార్చి నుతించుచుం జనె వెన న్వి స్పంది యానంది యై. ౩౭

ఎఱుఁగవచ్చు నెట్టు లీశ్వరు మాయ యు
చ్చటి జనములు మత్స్యసంగ్రహంబె
కాని పై నెఱుఁగర కని గ్రుడ్డి విని చెవ్వు
డన్న మాట నిక్కమయ్యె నపుడు. ౩౮

చప్పటులు గొట్టి కేకల
కుప్పర మెగయంగఁ బృథివియుఁ గరం బ్రదువన్
గప్పరము తెల్వి సంతస
ముప్పతిలఁగ నెల్ల రార్చి రుత్సాహమునన్. ౩౯

ఆ ల్లాలిత్యము గుణమో?
అల్లుం డను పదమువలని యావేశంబో
గొల్లనిగఁ జేయు మామయు
పల్లవితప్రేమదృఙ్నవస్థితిఁ గనియెన్. ౪౦

కనికని పట్టరాని తమకమ్మున నల్లునిఁ జేరఁ దీసి మె
త్తని తన కౌఁగిటం బొదివి తద్దయు ము ద్దగుచుండ మాడు మూ
ర్కొని యెనలేని మోదమునఁ గూరెఁ దదాత్మతఁ జెంది ధీవరుం
డనుమతవస్తులబ్ధి సుఖ మందెడువాఁ డుచితంబు లెంచునే? ౪౧

అన్న! నినుఁ గన్నవారలకన్నఁ బున్నె
మేన చేసితి నీ తేజ మెఱిఁగితి నని

సన్నుతు లొనర్పఁబోయి యశక్తు మనుచు
మలఁచి నిర్వృత్తి సానందమహిమఁ జెందె. ४२

అంత నంతికచరు లాయితం బొనర్చిన యాసనంబుల నమ్మహితు లాసీనులు గా నెన్నివిధంబుల మన యేలికయే కృతార్థుండు. కాకున్న నన్నట్టు లన్నియు నన్యులకు నమకూరునా? జగదద్భుతరూపధేయ సంపన్నుండును చిత్రచరిత్రుండును గలాకౌశలియు నగు నిల్లలితు నల్లునిఁ గాఁ బడయు భాగ్యంబు సామాన్యంబె. యిట్టి సుకృతికి బంధుగులము భృత్యులము మిత్రులము సన్నిహితులము నగు మన మిందఱము నీకృతిఁ జరితార్థుల మనుటలో సందియ మిసుమంతయు లేదు. ఇది యిట్టులుండ. ४३

సిరి పైకొనఁగఁజాలు సింగారవుంజాలు
సాగర మ్మీనయించు సాహసమ్ము
పయిఁ దేల్చివాక జాల్వాఱు ధైర్య మహాధ
రము గట్టితన మెంచు రాజసమ్ము
భువన మేలెడ నన్న పోడిమి కొక చిన్న
చేప నడ్డమువెట్టు చెట్టతనము
చూచినప్పుడ వీని సొబఁగుదీవికిఁ గూఁతు
ప్రాభవం బిడకున్న పరిభవమ్ము
ధర్మ మెద్దియొ మన కెన్నఁ దరమె? కాక
మర్మ మే మైనఁ గలదొ యీ మాన్యునందు?
కాని మన తేని చెయ్వు లికా్కలమునకు
ధీవరత్వమ్మునను మచ్చఁ దెచ్చుకొనియె. ४४

అని యనేకు లనేకవిధమ్ముల నద్భుతరసశాబల్యమ్మున మునింగి తదనుకూలభోరణుల నారఁగూరియుండఁ గుమారగుప్త హెచ్చరికఁ దెల్విఁదెచ్చుకొని ధీవరవరుండు—

తనవారిం దగువారి రాఁ బిలిచి గాద్గద్యంబు కంఠస్వనం
బునఁ జూపట్ట హలా యుమేశు కృప మా పున్నెంబు పండెన్ రయం
బున మీ రీ కథ యూరఁ జాట జనులం బుచ్చన్వలెన్ ముందు ప
త్తనముం గ్రొత్తగ సంస్కరింపవలయుం దత్తత్క్రియాశక్తులన్. ౪౭

అన్నిఁటికన్న మున్ను మన యంతిపురమ్మున వారికెల్ల మా
యన్నులమిన్నకుం దగు నొయారము మీఱ నలంకరించి సం
పన్ను నరు న్వరింపఁ బనుపన్వలె నంచు నెఱుంగఁజేయుఁడీ
పన్నుగ నంచు నాన లిడె వారు క్షణమ్మున నిర్వహింపఁగన్. ౪౮

యింత సెసి యిష్టగోష్ఠుల బ్రొద్దు పుచ్చుచు వీర లి ట్లుండి రప్పు డక్కడ.

## పతింవరాలంకరణము

అవరోధాన్తరసీమ భాస్వరసుమోద్యానంబునం గల్పితా
గవిభాగంబునఁ జారుశీతసికతౌఘస్వాదువాపీతటిన్
శివసూక్తంబులు వల్కు యౌవతము గ్లానిం బాపఁగా నున్న య
న్నవలాతో నొకనాతి సంభ్రమగతిన్ బ్రాపించి తా ని ట్లనెన్. ౪౯

అగుతఁ గల్యాణ మదుగొ గల్యాణి! నీదు
వల్లభుఁడు ని న్వరించె నభాజనముగఁ
జెట్టబేడిన వధఁ బట్టి చెలువ నీవు
చెలు వమర చెల్వుఁ జేరుట శేష మింక; ౫౦

కాముని బింక మింకఁ గొఱగాదు సుమీ సుమమృద్వి! కానలో
నామెయి మున్న కన్నుఁగవ హర్షసుధానిధిఁ దోఁగఁజేయుటన్
నీ మదిమెచ్చినట్టి యువనీమదనారి నిను న్వరించె మ
మ్మేమఱకుందు వెట్లు జగదేకవిభు న్విభుఁ జెంది? సుందరీ! ౫౧

వరవరణార్థమ్ము మధూకమాలాహస్త వగు నిన్నుఁ దోడ్తెమ్మని జనకుని యాజ్ఞ వచ్చినది యని సానందంబును సకౌతుకంబును సాకూతంబును సావధారణంబునుం గాఁ బలుకు దాని వాక్ప్రమంబు నానారూపంబున నచ్చటి మచ్చెకంటుల కెల్లఁ గర్ణపూరం బయి సుఖవాసనల నాన . లెల్ల నాక్రమింప నవ్వారలు దిగ్గన లేచి సిగ్గువడు న గ్గౌరాంగి నగౌరవంబుగా నచ్చటి చంద్రశాలం జేరిచి దృఢాసనమ్మున నునిచి మంగళారార్తికలతోఁ బాటలువాడుచు శిరం బంటి నలుగులు వెట్టి ముచ్చటలతోఁ బన్నీట జలకమాడించి కైశ్యమ్ము నధూపమ్మును సానుబంధమ్మును నకునుమమ్మునుం గా నలంకరించిరి. ౫౨

పరిధానముఁ గట్టెడునెడఁ
గరియాన యొకర్తు గట్టిగా బిగిచియు వే
నరి కా దని మార్చుడి యిడఁ
దరుణి కుపిత యగుచుఁ జేతి తమ్మిం బూఁచెన్. ౫౩

తరుణీమణి యొకర్తు తళుకులీనెడు కంచు
కము తొడిగి బిగించి కనులుమీటె
సుమగంధి మఱొకతె గుమగుమలాడు మే
ల్మెపూత పూసి మైమఱవు నూపె
నుత్పలనేత్ర వే రొర్తు కాటుక దిద్ది
కమనీయతకుఁ జొక్కి కళవళపడె
సారసపద యొర్తు చరణంబులకు లాక్ష
వెట్టి గుట్టుగ నేమొ వేఁడుకొనియె
నేమి చెప్పంగవచ్చు నా యింతి కాంతి
యప్పటికి ముమ్మడుంగు లత్యధిక మయ్యె
లీల నత్తన్విఁ గని కౌఁగిలింపఁబోయి
కొంచి చెలులెల్ల నాల్కలు కొఱికికొనిరి. ౫౪

అలావణ్యముఁ జూచి చొక్కని వయస్యావ్రాత మా లీలకున్
శీలంబు న్విడకున్న యౌవతము నా సింగారముం గాంచి నై

జాలంకారము దూఱకున్న తరుణీస్వాంతవ్రజంబుం బళీ
యా లీలాగృహమందె లే దనఁగ నేలా ? లేద లోకావళిన్. ౫౫

చెప్పవలయున కవి విశ్వసింపకున్నఁ
దనదు సిరిఁ దాన చూచి యాదర్శతలము
నం దల లతాంగి పొడము మోహమున కలిమిఁ
చిత్తరువుబొమ్మ పోలె నిశ్చేష్ట యయ్యె. ౫౬

ఆవేళం దన జన్మజన్మసుకృతౌఘాంకూరముల్ తీవ లై
తావు ల్నించు సుమావళిం బొనర నా తస్వప్రసూరత్న మా
తావుం జేరి సుతం గృతార్థ వని హార్దం బొప్ప శ్లాఘించి సం
భావించె న్వెసఁ గౌఁగిలించె నిజసద్భాగ్యంబు వర్ణించుచున్. ౫౭

అమ్మ ! నిను సర్వలోకమహార్హఁ గనుట
వలనఁ బేర్పడితిమి కాంచువార మనము
కలిమి కొక కల్మిఁ గూర్చు ముక్తాఫలంబు
చాయవలనున కాదె వంశప్రతిష్ఠ. ౫౮

నీ జన్మాంశము నీ లసద్విభవమున్ నీ రూపధేయంబు నీ
సౌజన్యంబు మహత్త్వముం దలఁచినన్ శర్వాణి వీ వంచు హృ
ద్రాజీవంబునఁ దోఁచు మాదృశుల కా తత్త్వంబు మా కందదే
నోజంబుం గని సారనారి వనరా ? యుక్తాత్మ లాత్మేశ్వరీ ! ౫౯

కష్టపడి చేయు తత్తపఃకలితఫలము
క్రతుశతంబు మహేశ్వరార్పణ మొనర్చు
యోగులకు లేని చింత మా కొదవె నమ్మ !
ని న్వరున కిడ నెడబాసి నిలువలేమి. ౬౦

అని కల్యాణము బొట్టు వెట్టి చిబుకం బ ల్లెత్తి హార్దంబునం
గని ముద్దాడి సుతా ! త్వదర్థ జగతీకల్యాణుఁ గైవర్తనా

ధుని ధీవర్యు వరించి మాకొలము మాతో నంతరింప న్సుఖం
బున వర్తింపు మటంచు దీవనల సంబోధించెఁ దాఁ బుత్రికన్. ౬౧

వందన మొనర్చి తల్లి దీవనల నొంది
కాంతుని వరింపఁ గౌతుకాక్రాంత యైన
కన్నెఁ జతురంతయానయోగమునఁ గూర్చి
కూర్చుచెలు లెల్లఁ బలిసిరి కోర్కులెసఁగ. ౬౨

చిత్రాభం బగు నాతపత్రము వహించెం జెల్వ యొక్కర్తు స
ద్గాత్రుల్ వైలుగఁ దాల్చి రిద్ద ఱిరుప్రక్కం జామరద్వంద్వముల్
విత్రాసం బిడు ఖడ్గము ల్తొడిగి తన్వీపాళి ముం దుండె నా
చైత్రాపాంగి మహామహేశ్వరునకై సాగించు యానమ్మునన్. ౬౩

## స్వ యం వ ర ము

చిలుకతేజీరౌతు గెలుపున కాధార
మని కొన్ని చిల్క లట్లనుసరించె
మాధవసర్వస్వమంగళదేవత
యని కొన్ని కోయిల లఱువఁజొచ్చె
ఘను మ్రోల మెఱయంగ జనెడు సౌదామని
యని కొన్ని నెమ్మి లా యాట సూపె
రతిచేతి వింటి కొరన మైన పూబంతి
యని కొన్ని తుమ్మెద లనుగుణించెఁ
జాన వరు వరింప జనఁ గల్గె నానార్థ
విభ్రమం బటన్న విశ్వసింప
రున్నయదియ కవుల కూసోక్తిభీతుల
కతిశయోక్తివలని యుప్రతిష్ఠ. ౬౪

పౌరసతులు సేన లారఁ జల్లుచునుండ
వాద్యములును ధూపవాసనలును
నొనరఁ బోయి నాథుఁ డున్న వారిధి తటిఁ
జూపు వంచె వంచె సుదతి శిరము. ౬౫

భామవిండ్లం గదలింపలేదు నయనస్ఫారస్త్రసంధానపుం
గమకం బింతయు లేదు లే దిఁక స్మితాఖ్యస్త్రైణశక్తిప్రభా
ణము వేణీపదచంద్రహాసమున కైనం గల్గలే దింత కా
ర్యము మర్షారె మరుండు తద్ధృతితనుత్రాణంబు సించె న్వెసన్. ౬౬

చానపై గూర్మి వెలయ మత్స్యంబుఁ బట్టి
తింక నిపు డేమి సి గ్గని యెనసెను రతి
సమయముం గని మును పిఱుసనఁగలేదె?
మంచితొడ వే నిపు డని బోధించెఁ ద్రపయు. ౬౭

మాయలమారి యాతఁడు చమత్కృతికిం గొఱలేదు కాన న
య్యాయతనేత్రఁ గన్గొనుచు నందఱకుం దన సిగ్గుఁ జూపెఁబో
యాయుమ సిగ్గ నైన రతి నైనఁ గనుంగొనఁజాలిరొక్కొ? వి
ద్యాయిత యానమధ్యమున దర్ప మెలర్పఁగ నున్న చెన్నునన్. ౬౮

యానధారుల కాశ్చర్య మాత్మఁ బొడమి
యధిక మగుడు నహో యహో యని యఱచుచుఁ
బఱచి తత్సభ డించి రా భద్రశిబికఁ
జిత్రముగ నా త్రిపావతి చెలువు వెలయ. ౬౯

అట్టియెడ న్సఖీనిచయ మాయుమ చుట్టును ముట్టి కేల కే
ల్పట్టి నయాన యాన మెడలం బచరించినఁ గాననయ్యె నా
పట్టునఁ జంచలానియుతభావిభవస్ఫురణంబు దానితో
సట్టి కనుంగవ న్మొగిచె నచ్చటి సార్థ మసార్థకంబుగన్. ౭౦

ఎట్టకేలకుఁ దెఱిచిన యీాక్షణముల
కల చెలుల మేలి జిగివాఁక నవఘళించు
తత్తను ప్రతిబింబశతంబులోన
వే వివేచింపరాకుండె నా వనితయు. ౭౧

ఆశలఁ జూచువారును వయస్యల కాంతికిఁ జొక్కువారు దా
శేశునిఁ జూచి జంకున మృగేక్షణ రాకడ మాట తేమొ యా
వేశముఁ జెందువారు నయి భిన్నగతిం జను లుండ నైరి నా
కేశముఖు ల్తదుత్సవము నెంచి నభస్థలి నాక్రమింపఁగన్. ౭౨

లలితు ముందర నా కల్కి కలిమి పొలిచె
నినుని దరి పద్మినిం జూడమే ? కుముదిని
రాజుఁ గొని రాణఁ బెంచు తరం బెఱుఁగమొ ?
తారసిల పొక్కటియుఁ బోల్చుద మనుకొనిన. ౭౩

ఇబ్బంగి న భీక్షితసారంగాపాంగి యిచ్చ ముచ్చిలు ముచ్చటల పైపెచ్చు
నకు లొచ్చె పైఁబాఱు పూవింటిసర్దారు నారసంబుల బార్ల పుంఖంబు లన
నై గఱుపారుత నూరుహంబుల కలిమికి సోల్లాన యై పెనఁగుటకు వాఁడు
సైరింపక యరివోసిన హృదయాంధంకరణం బగు మోహనాస్త్రంపు మహి
మమున నించుక తలవాంచియు లోచనాంతాలోకనంబుల పేరిట నాచ్ఛా
దించి తా నిగుడ్చు ప్రజ్ఞాశరంబుల గుఱులకు హర్షక్రోధస్వాధీనుం డై
యాఫీరుండు సేయునది లేక యా భవదేవుని రామణీయకంబ నైజజ్యోత
లంబున కలంకారం బొనర్చిన నా కొమవలన వెలువడు సాత్వికశరా
పారంబు విస్తారం బగుడుఁ గనువారల కీ రెండు కన్నులుఁ జాలకుండె.
నా ఘనాగమంబునఁ గందళితహృదయకందళి యగు నా సుందరి
నిందిందిరమాలిక సుమహితగుణంబులు దివిజతరువుం బోలె సుమహిత
గుణంబుల దయితుదరిం జేర్ప నెచ్చెలులు నిమిత్తమాత్ర లైరి. అత్తఱి
జనకు నాదేశంబున నా దేశంబున కలంకృతి యగు పతి వరింపఁగోరు
నా తన్వి సిగ్గు పేరిటి యజ్ఞానంబు వెన్నెలల నడిమి చీఁకటి వోలె నన్ను

గిల్లె. నట్టియెడ రతి యాదేశంబునఁ బ్రగల్భ యగు ప్రజ్ఞావతి చెలుల
తోడిప యై తెఱపిసూపి తోడు నడుచుటయు. ౭౪

ఆ పతింవర నమదేభయాన మమర
డగ్గఱి స్ఫురించు నాథు కంఠతలమందు
నుంచెను మధూకమాలిక పంచశరుని
యాన నలికౌతుకాశింజతాంచితముగ. ౭౫

ఆ తెఱవ తనువు ధనువుగ
నాతతగుణయుక్తి గుణమ యయి పొలుపమరన్
జేతోభవు కురియు శర
వ్రాతముగాఁ దోఁచెఁ జూచువారల కదియున్. ౭౬

గంధలోలము లైన పుష్పంధయముల
తో నతని మెడ మెఱసె మధూకదామ
మయిదు బాణంబు లయిపోవ నతను విసివి
వినరివైచిన గుణధనుర్వ్రతతి వోలె. ౭౭

ఘనుని వరించితి భవదే
వుని నే మన మలర ననెడు పూఁబోడి మృదు
స్వనవచనరచన పొలిచెన్
ననవిల్తుని చిలుక విజయనాదము నాఁగన్. ౭౮

భావభవుచేతఁ బ్రేరేపఁబడి వెలువడి
పయన మై సాగి యుఱత్రోవ భ్రంశ మంది
చొరఁ దెరువులేక యిరువురి చూపుఁదూపు
లంచితము లౌట వచ్చిన యట్లు మరలు. ౭౯

ఈలీలఁ గొంతతఱి ని
ర్వేలసుఖాంభోధిఁ దోఁగి విభుఁ డిడె నానన్

బాలామణిఁ గొనిచన నా
వేల వితానం బమర్చె వెలఁదుక చూపుల్. ౮౦

అంత నంతర్పపు సంతకు నంతరాయంబు సేయుచుఁ జెంతనున్న కాంతలు చెలువా! చెలువు నామంత్రించెదవే? యని దరహాసచంద్రికల నన్నెల వలంకరింప నమ్మానిని పరభావగోచరంబు కాని భావస్ఫురణంబునఁ జురచురఁ జూడ సానునయమ్ముగ వార లా వధూరత్నంబుం జతురంత యానంబున నునిచి వెనుకొని రపుడు శిబికాధరస్థు లవ్వరుని సాధింప మనసిజు పనిచిన దూత లగుటనో? యోహోనాదవాదములతో నతిరయమ్మున నడువఁదొడంగిరి. ౮౧

ఆ వధూవరులకుఁ జూచునట్టివారి
కెవ్వరికి నొప్పుదల లేని యీ ప్రయాణ
మొక్క పతి యాజ్ఞ నలుపు భృత్యులకుఁ దెల్వి
కలదె? బహునమ్రతికి లోఁగవలదె యెందు? ౮౨

పిలిచితివా? చెలి! యని యా
లలన వెనుకదిరిగి చూచు లాగు దెలిసి నె
చ్చెలి పిలిచెనేమొకో? యని
కిలకిల మనఁ జాన గొణిగెఁ గించిద్రుష యై. ౮౩

అట్టియెడ సిగ్గు నెడపెట్టి యలరుఁబోఁడి
య వ్వరు మహార్హచిత్రరత్నాంకురంబు
గుట్టు చప్పుడి కాకుండఁ గొంచు నేగెఁ
గాంతలకుఁ దెల్వి యధికంబు కార్యఘటన. ౮౪

ఇట్టు లా మీనలోచన పట్టువట్టి
మీనుఁబట్టిన దోసంబు మెయి నొలసిన
రోసమునసో దయితు నెడ బాసి చనియె
నంతిపురమున కపుడు దాశాధిపతియు. ౮౫

జెండా లెట్టుఁడు తోరణమ్ములకు వాసిం జెందు వస్త్రంబులన్
నిండారం బురిలోన చిత్తరువులన్ నిర్మింపుఁ డుత్సవం
బుం డం బొప్పఁగఁ జాటుఁ డింకఁ గవళీపుంజంబుల న్నిల్పుఁ డా
భాండాగారములన్ మహోత్సవములున్ భావింపుఁ డిం పై నటుల్.

ఇది యది నా కియ్యెడ నె
య్యది కర్తవ్యంబు చిత్ర మాహార్యక మా
న్పద ముత్సవముల కయ్యది
యది కూర్పుఁడు నగరు క్రొత్త యలరులఁ జెలఁగన్. ౮౭

అని తగువారల కాదేశించి యన్యుల యథోచితమ్ముగ వీడ్కొలిపి మిగిలిన పరివారంబుతో జామాతను తన్మిత్రుండును నిజగ్రామవాసియు వైశ్య శ్రేష్ఠుండు నవు కుమారుగుప్తునిం డోడ్కొని చని ఝుంఝు మ్మను తేఁటిగ ముల పాటలకుఁ దలలూఁచుచు నిజప్రసూనరసంబుల వెయ్యాయ ముయ్యారు గా బహూకరించుచుఁ జాల దను కొఱఁతనే తలలు వాంచి నటు లున్న మల్లీముఖవల్లీవితానమ్ములచే వాసితమ్ము లగు వలభీప్రా తమ్ములు కల విశాలరమ్యహర్మ్యతల మ్మల్లునకు విడిది గా నిడి వైశ్య రత్నంబు నచ్చో హెచ్చుతగ్గు లరసి కావలసిన పదార్థంబు లెల్ల నమ కూర్పం జాలించి యంతిపురంబున కరిగి సంతసమ్మున మునిఁగియు జాయాసమేతుం డై కార్యాంశమ్ముల జాగరూకుం డై యుండె. నాభవ దేవుండును నిమిషమ్ముల నిమిషమ్ము లగు యుగమ్ములుగ గడపుచుండ నమందప్రతిభు లగు వందిమాగధులు సాయంసమయప్రస్తుతిప్రస్తావాను కూలంబుగాఁ గలంబుగా— ౮౮

కోకిపైఁ గోకమున కెంత కూర్మి యైనఁ
గోకి ప్రాణంబు లైదు నా కోక మైనఁ
దమి సహించునె? తమ మేలు తమక కాక
యొరుల మేలు దలంచువా రుర్విఁ గలరె? ౮౯

సంధ్య యనురక్త యైన వాసరము దాని
చెంత నంతింతగా నెంత చెలఁగుచున్న
విధివిచిత్రవిలాస మే వెరవుచేతఁ
గప్పిపుచ్చంగనేర్చు సంగమము కోర్కి. ౯౦

అవనిసురరాజు కరముల నట్లు పఱపఁ
గైరవిణి స్మేరవదన గాఁ గాంచి కాంచి
యొర్వలేమియ కాక వేఱొండు కలదె ?
కనులు మూయు నిమిత్తంబు కమలినులకు. ౯౧

అని యి ట్లుచితగీతికానైపుణి నతని నారాధించి కృతార్థు లై. రంతకు నిశాశ్యామాపరభాగోన్నతి యవర్ణ్యం బై దూరగతం బయ్యె. ననిన విని జ్ఞాననిష్ఠాదు లద్భుతాయత్తచిత్తు లై యవ్వాలికథాంశంబు విన నతికుతుకమ్మున దవులుదియు. ౯౨

ఇంకొల్లుపురనివాసా !
సంకల్పవికల్పరహిత ! సజ్జనమిత్రా !
శంకాతంకవివర్జిత
శంకరసునిరూపితాధ్వసాధ్గమితాత్మా ! ౯౩

శివశ్రీపదాంభోజచింతాప్రశాంతా !
నివాసక్షమాగ్రస్థినీవారనీరా
న్నవస్త్రాదిదానావనక్రీతలోకా !
కవిస్తోత్రపాత్రప్రకామ్యప్రకారా ! ౯౪

ఇది శ్రీమద్రామకథామృతకవికుమారహనుమాంబాశమిగర్భహావిర్భూరాయ
మాంబ శ్రీదేవీసేవ్యమాన రాఘవనారాయణాభిధాన కవి గ్రథితం
బగు కల్యాణకైవర్తకం బను ప్రబంధంబునఁ
దృతీయాశ్వాసము. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# కల్యాణకైవర్తకము

## చతుర్థాశ్వాసము

శ్రీవితరణకృతవిజ్ఞా
నా! వరలక్ష్మీశసత్యనారాయణనా
మావరజనిత్యసేవిత
భావుకపదనరసిజయుగభవ్యవిభూతీ! ౧

విను మా వ్యాసాంతేవాసి శుశ్రూషములగు జ్ఞాననిష్ఠాదుల కిట్లనియె. ౨

### ప్రాతఃకాలము

చక్రఘోషంబు విరహిణీస్వాంతములును
తపను తపము తపస్వుల తలఁపు జార
చోరతతి దురదృష్టంబుఁ జేరి వేగఁ
గాలచక్రంబుఁ ద్రిప్పెనొ? కడచె రేయి. ౩

దిననాటకమునఁ బ్రస్తా
వన వేకువచుక్క యనెడు భరతసుతుఁ డొన
ర్చిన నిను సవరణకై పఱ
పిన తెర యన సాంధ్యరాగవిభ్రమ మొప్పెన్. ౪

జిక్కవ నిక్కవుం జెలిమి సంచు మెఱుంగుల పెట్టి కొల్చినం
జిక్కు లెడల్చు వేలుపు వజీరులు జోగులు పొవు త్రోవ ప్రా

గ్గినుఁ గనఁ దేజముం గొలిపి దేశము కన్నులు మూసి యేచు నా
చిక్కని చీఁకటిం గెడపి చెందె స్వరాజ్య మినుం డనల్పుఁ డై. ౫

భువనజను ల్మహోత్సవముఁ బొందఁగఁ జక్రము లుల్లసిల్లఁగా
దివసరమాముఖంబునకుఁ దెల్వి విశేషము గాఁగ సద్ద్విజ
ప్రవరులు వే విధంబుల కరంబులు మోడ్చి నుతించు లోకబాం
ధవు నుదయంబు వేళఁ గుముదంబుల మూతు లెవండు చూచెడుఙా.

కల్యాణ మబ్జినులకుం
గల్యాగము ముత్పలిన్యగారములకు మాం
గల్యము త్రిభువనముల కగు
కల్యమ్మున న ప్పురమ్ము కలకల మనియెఙా. ౬

అంతమున్న తేఁ డిడిన యానకు వేడుకఁ దోడుసేసి సా
మంతులు వంపఁ గూర్చు జనమండలికిం గడుఁ గూర్చి యూరివా
రింతట నంతటఙా నగరి కెల్లెడఁ బూతలు చాందినీలు ప
ల్వింతపతాకిక ల్నవవివేఖ్యములు న్సమకూర్చి రొక్కఁటఙా. ౭

ఊరుమార్గముల నెల్ల నూడ్చించి పన్నీరు
చిలికి పువ్వుల తివాచీలు పఱచి
యెడనెడ నుత్సవం బెఱిఁగించు నక్షర
వితతితో బారుసీవిరు లమర్చి
చలువపందిళ్ళ వజ్రపు జాలరులు గ్రాలు
లీలఁ జిత్రపుఁ జాందినీలు గట్టి
యగురుధూపముల మే లగు తావులం గూర్చి
మణిదీపికాపరంపరలు గొలిపి
పొనఁగ జెండాలు వన్ని కప్పురపుటనంటి
కంబముల నిరుగెలంకులఁ గలఘటించి
మేలిమేడల గోడల మెఱుఁగులీను
చిత్రములు వ్రాసి క్రొత్తసేసిరి పురంబు. ౮

మృగమదంబున నలికిన మేదినీత
లంబులం గప్పురపు ముగ్గులను రచించి
వట్టివేరుల చాపలఁ బఱచి యెల్ల
వారలు నలంకరించి రావాసములను. ౧౦

పుర మెల్ల నంతిపురమున
సిరిఁ దనరఁగ నచటి కలిమి చెప్పఁ గొలఁదియే ?
పరికర్మకరులకన్న న
గరు ముందర వేడుక కయి కాలె న్స్వయముగఁ. ౧౧

స్థగితరత్నోజ్జ్వలస్తంభసంఘాతంబు
పైఁ బూఁతపూయ నె వ్వరును లేమిఁ
చిత్రీకరణచుంచుచిత్రజాతికిఁ జిత్ర
కత్వము గొలుప నక్కఱయ లేమి
రాజాననాప్రచారస్రవదిందూప
లేల శైత్యము గూర్చు వైలు లేమిఁ
గప్పురకస్తూరికాకృతకాత్మజ
పాళి కొలపుఁ గూర్చు పనులు లేమి
మంగళము లంచుఁ దోరణమాలిక లొగి
మరకతప్రచురద్వారమధ్యసీమ
సరభసాంచత్ప్రసాధికాజనము మాటి
మాటికిం బన్నె న మ్మహామహమునందు. ౧౨

ద్వారబంధములఁ గస్తూరి పూయఁగ నేగి
నీలాల నెఱచాయ నీటు చూచి
మండెగమ్ములఁ గుంకుమపుబొట్టు విడఁ బోయి
పద్మరాగప్రభాపటలముఁ గని
మెఱయు కంబములఁ జిత్తరువు లుంచ మెలంగి
నిలిచి నిండిన తమ నీడఁ గాంచి

యూర్ధ్వతలంబుల కుల్లోచములఁ బన్నఁ
జని వజ్రదీప్తిప్రసార మెంచి
తమకు ము న్నెల్లపను లాయితము లొనర్చి
రనుచుఁ దమతోడివారి తెల్విని గణించి
యటు నిటు చరించు నుత్సవవ్యగ్ర లయిన
కాంత లచ్చోటి కొక యలంకార మైరి. ౧౩

పూఁదేనెసోనలఁ బొలుపు దీపింప నొ
య్యన మంగళస్నాన మాచరించి
మొగుల బుగురొల్కు న్న యగురుధూపంబులఁ
దనరు పెన్నెఱివేణి త్రావిఁ గూర్చి
రింగులకుం గూర్చు రంగుల మణిమాలి
కల కల గల యంశుకములు దాల్చి
యెడనెడఁ గడు నంద మిడు నెలకల్మి మె
ప్పులఁ గాంచు మేలి సొమ్ములు ధరించి
కలితకల్యాణములు తిలకములు వెలయ
వరునకై చూచు నొక పతింవర కైన యనఁ
గూడు నంతఃపురికిఁ దోడు తోడిపెండ్లి
కూఁతు రనఁ దత్పురీనారి కొమరు గాంచె. ౧౪

పెండ్లికొడుకు తర్లివచ్చుట

అనమయమ్మున— ౧౫

అపరిమితకుసుమపరిమళ
నిపతన్మధుప్రపంచనీలవితానా
తపహారి హారిమాంద్య
వ్యపచితపవన మవు తత్పురోపవనమునఁ. ౧౬

అలరు మిఱు తదంతర్వణాంతరమునఁ
గెలనఁ బూచిన కేళికంకేళితరుల
కలిమ కొక క్రొత్తఁదన మిచ్చి చెలిమిఁ గొన్న
తెల్వి దీపించు తీవపందిళ్లనడుమ. ౧౪

రంగారు మణుల తళుకుల
బంగారము సొరు పొప్పపరమాణువులన్
సింగారపుఁజిగిఁ గూర్చి య
నంగుని చిత్తము రచించె నన నగు మేడన్. ౧౮

మత్తగజకర్ణచాలనామార్జిత మయి
తన్మదస్రావసిక్త మై తతతదీయ
రదనపరిబింబరంగవల్ల్యుదితశోభఁ
గలిమిఁ దులకించు నట్టి ముంగిలి మొగదల. ౧౯

ఐరావతంబు చుట్టమొ?
గౌరు సమాకృతి వహించి కానఁగ నై యొ
ప్పారు శిలాదాపత్యమొ?
నా రాణించు నొక సమదనాగమునందున్. ౨౦

రతనముల కంబముల మేలి రమ దలిర్పఁ
గెలనఁ జిత్తరువులు గ్రాలఁ గింకిణీక
జాలజాలకములతో విశాలలీలఁ
బరఁగు కమనీయ మైన యంభారిలోన. ౨౧

పులితోలు వన్నె దువ్వలువ దాల్చినవాఁడు
కరుణ గారెడు కనుకడలవాఁడు
చంద్రకితకిరీటచాకచక్యమువాఁడు
సింహసత్వంబు హసించువాఁడు

రమణీయరత్నతారకితవక్షమువాఁడు
మోహన మైన నెమ్మోమువాఁడు
దట్టపు మైపూఁతఁ దనరు మేజిగివాఁడు
సహజప్రకాశభూష లురువాఁడు
మరువువాపిన మరు మేలి శర మనంగఁ
గలితకౌతుకచిహ్నవికాసుఁ డగుచు
మిత్రుతోఁ గూడి యమ్మేటి మేడ వెడలి
యల్లనల్లన మణిపీఠి నధివసించె. ౨౨

సారసాక్షులు గొనిరి వింజామరములు
గొడుగు దాల్చి కొలిచె నొక్క కువలయాక్షి
రతనముల పళ్ళెరముల నారతుల నిడిరి
సతులు భూదేవతాశీఃప్రసక్తు లొప్పె. ౨౩

సత్కృతుం డైన దాశవరు పురోహితుండు ముహూర్తం బాసన్నం బగు
చున్న దని తొందరసేయుటయు నా సమయమ్మున. ౨౪

వాస్తవపరిమళశైత్య
ప్రస్తావము దెలుపు మలయపవనునితో నా
హస్తికులసుప్రశస్తము
హాస్తిపకుని నన్నుఁ గొన్నియడుగు లిడుటయున్. ౨౫

వామకక్షమునం దన బాలుఁ దాల్చి
మూఁపుపైన పయోధరముల కెన యగు
పూర్ణకుంభ మహామతఁ బొసఁగ వామ
మైన కరమునఁ గొని యొక్క చాన దోఁచె. ౨౬

సంతసించి దానఁ దనవారితోఁ గూడఁ
బురపథంబుఁ జొచ్చి పోవుచున్న

మదను నొసలి బెడఁగుఁ జిదిమి పెట్టిన దాని
యంద మెంచఁబొడఁగి రతివ లెల్ల. సమోషు

నగము దిద్దిన బొట్టు సాహసిక్యముఁ దెల్ప తేచి...
వడి జేరె నొకతె గవాక్షతలము
నద్ధము దువ్వెన యలరు చేతులతోన
కురులు వ్రేలఁగఁ బోయెఁ గొమ్మ యొర్దు
తనవారి పిలుపు నెట్టన త్రోచి పరువెత్తె
నీవిఁ గైకొని యొక నెలఁతమిన్న
చెలి యిచ్చు పూవండ చేతులనె ధరించి
వేగంబు మై నొక్క వెలఁది వాఱె
తనదు ముద్దరాలితనము దానిక కూర్చి
పోయెఁ బ్రౌఢ వోలె ముగ్ధ యొకతె
యిదుగొ వచ్చుచుంటి నిప్పుడ యని నాథుఁ
బులిమిపుచ్చి యొక్క పొలతి నవియె. ౨౮

చూచువారు సిరికిఁ జొక్కువారును గూర్మి
నెఱుకపఱచి పండ్లు గొఱుకువారు
నగుచు వెల్లివిరిసి రల్ల తలోదరు
ల్మనసు నిల్పఁగలదె? మగువజాతి. ౨౯

అతివమిన్న యొకతె యద్వయబుద్ధితో
నింతనుండి సుఖము నెనయుదాన
నాత్మవిభుని నేతదాత్మత భావించి
యనుచు నిశ్చయించె నాత్మయందు. 30

ఆచటి పూరుషవరులు నయ్యనఘుఁ జూచి
యాడువారలఁ గా తమ్ము నాత్మఁ దలచి
కోరికలు మీఱఁ గనులతోఁ జేరఁబాఱి
మించు మనములతోఁ గౌఁగిలించుకొనిరి. 3౧

అంగజు నంగసౌష్ఠవమొ ? హావవిశేషము గొన్న వేషమో ?
సంగతసర్వరత్నరుచిసారమొ ? ధాతృవిధానచాతురీ
భంగకరాత్మభానమొ ? శుభప్రవిభాగమొ ? నాఁగ నొప్పె భూ
మిం గలరే ? యిసంవిధు లమేయము ధీవరు భాగ్య మెంతయుఁజా.

ఆ మోమునకు విధి యాననమ్మను బోల్చు
కవులకు నింక గౌరవము గలదె
యా యాకృతికి నింత యైశ్వర్య మని పల్కు
సాముద్రికులకు వాస్తవము సున్న
యా సమృద్ధికి మేలి యాశీస్సులం గూర్చు
వైదికోత్తములకు వాదు లేదు
యా గుణంబుల లెక్క కమరి నిల్చెద మన్న
గణికులకుం బ్రదుకంగ రాదు
యా జగన్మోహనాకారు హరువుఁ గనినఁ
బురుషులకు నేని మోహంబు పొడముననిన
నాడువారల గతికి మాటాడఁదరమె ?
పంచనారాచుఁ డింకొక్క బలు పెనయ్యఁడె.

ఇది పాల్కడలు లొక్క పదివేలు నృజియింపఁ
గలవానిఁ గనజాలు కలికితమ్మి
యిది రాజవదనాప్రమదదృక్కుముదపాళి
ననిశ ము బ్బెనయించు నమృతఘటిక
యిది దేహలావణ్యపదపయోంబుధి నిట్టఁ
గరుడు గట్టిన జున్నుగడ్డ నిగ్గు
యిది త్రిలోకీరూపమదదధిపూరంబు
విడఁజిల్కి యెత్తిన వెన్నముద్ద
యిది కలావాన మిది రసహ్రదవిశేష
మిది సౌబఁగుదీవి యిది మేలి మదను సదన
మిది మహేశ్వరు నవసృష్టి యింత వింత
కయిన యియ్యది సామాన్య మగు మొగంబె ?

అమృతాంశుబింబంబు నందుఁ బైడితెలుంగుఁ
జూపెట్టి మీసంపు సొంపుఁ బెంప
నరవిందదలముల యందుఁ గల్వల రంగు
తో రాగరేఖల సొరు దార్ప
యుగములకుం బూవు తెగ మెత్తదనముతో
రాగిల్లు కిసలయారమ రచింప
సారసముల కొక్క చక్కదనం బిచ్చి
కడఁ జనకుండ టీగములు వైవఁ
దాత చేత నసునె? దర్పకుఁ డశరీరి
యౌవనంబొ స్పష్టమైన వస్తు
వునకు వంక లొత్తు మొనయ దన్యమున కీ
సృష్టి కారణం బదృష్ట మెదియొ? 36

ఇది జగన్మోహన మొదవించు మదనారి
రూపధేయవుఁ బ్రతిరూపకలన
యిది దాశవరు పూర్వకృతసత్కృతౌఘంబు
పండి విరియఁబడ్డ పంటచేను
యివి దాశకన్యక హేలాలతిక లల్లి
నజుఁడు దార్చిన యాశ్రయద్రుమంబు
యిది మేము మా కను తెల్లఁ జల్లగఁ గాంచ
మున్ను గూరిచిన నోముల ఫలంబు
యిది రసంబుల నవక మియ్యది గొనముల
గొనము సొబఁగుల సొబగు లేఁదనముల లతి
సారముల సార మందాల చంద మనుచుఁ
బొగడఁజొచ్చిరి వీధుల పొడవుపొడవు. 37

ఈ రీతిఁ బౌరజనతా
శారవచోమృతము శ్రుతుల చక్కటి కెక్కన్
వారల పద్దులు నూచుచుఁ
జేరె నతఁడు పెండ్లియింటి చేరువ కచటన్. 38

ముందుగా డిగ్గి మిత్రుం డమందకౌతు
కమునఁ జేయూఁత మిడ వాఁడు గజముడిగియె
డాశవర్యుండుఁ బరితరోదారుఁ డగుచు
నెదురుగా వచ్చి వరపూజ లెలమి సలిపె. ౩౮

వాకను వీరుఁ గూడుతఱి వారిధు లొండురు మీఱు చందమై
చేరువనున్నవారి నవిశేషముదంబుధి ముంచు ట్రబమే ?
వారలు మొత్తమై వరుని పజ్జన వోయిరి ధీవరుండు మున్
దారులు సూప దాటిచనె ద్వారము లాతఁడు గొన్ని యచ్చటన్. ౩౯

కాంతిపూరము దెచ్చి కడఁ జనకుండ నొ
క్కెడ దాచివెట్టిన గెడ యనంగఁ
దన సృష్టికై విరించనుఁడు గూర్చిన రంజ
నద్రవ్యముల సదనం బనంగఁ
గలిమికన్నియ నాటకం బాడుచున్నట్టి
లలి మీఱు రంగస్థలం బనంగ
రస్యదృశ్యం బైన రత్నగర్భావర్ష
కమనీయగర్భభాగం బనంగఁ
జూపు సైదో డనంగఁ గలాపణ మన
మెఱుపు దీవల నిలుకడ మేల్మి యనఁగ
వనఁగ ననఁగ నే మేమొ యై యతిశయిల్లు
నట్టి తత్కౌతుకార్హగృహాంతరమున. ౪౦

నవరసంబులు గురియ గారవము మెఱయఁ
గవివరులు కూర్చినట్టి పాకం బనంగ
షడ్రసంబుల ననువు గా నలిపినట్టి
పాకమున లేని నూత్నానుభవ మనంగ. ౪౧

ఒకక్రేవ జలరాశి నుద్వృత్తమౌ మీను
వలఁ బట్టు చారిత్రవైభవంబు

ఒకవంక సకలంకవికసనం బౌ వాశ
కన్యాస్వయంవరకౌశలంబు
ఒకచోట హిమవంతు సుదవసితమ్మున
భాసిల్లు పార్వతీపరిణయంబు
ఒకచాయ రసచాకచకికాచితమ్ము సీ
తారామకల్యాణ ధర్మతత్త్వ
మెడ నెడం బుణ్యగాథ లి ట్లెనక మెసఁగఁ
జిత్తరువు లెత్తి ముగ్గులు ముత్తియముల
శాల రంగులు లలిఁ జాందినీలు గూర్చి
యుపచరించిన పెండ్లిమంటపము నెనసె. ౪౨

దాని కిరుదెస నైక్షవదండయుగము
పొంత ప్రోయు మధువ్రతపుంజముఁ గని
వరుడు మరుచెయ్వు లెంచి నిబ్బరము వాసి
వాసి కెనసెను దేకువ ప్రాభవమున. ౪౩

చెందిన మోదమున గణా
నందుండు పురోహితుండు సవ్యాశీర్వా
క్సందోహముతో నా వరు
నందలి కల్యాణపీఠమందుం జేర్చెన్. ౪౪

వరు మిత్రుఁడు తఱి యిది యని
పురోహితుం జేరి పలికె పొలు పమరఁగ నీ
యిరుగడ పౌరోహిత్యం
బిరుగడ పెత్తనము మనకు నిరువుర కనుచున్. ౪౫

దానికి నట్లకాక యని మతింత సంతసించి య గ్గణానందుండు. ౪౬

మును విష్ణ్వీశ్వరు సర్చనం దనిపి విప్రు ల్గాఢఁ బుణ్యాహవా
చనముం గూర్చి మంత్రతంత్రకృతిరక్షాబంధముం దార్చి యా

ఘనుఁ డౌ దాశవరేణ్యుచేత మధుపర్కం బర్ఘ్య మిప్పించి పైఁ
జను తత్తత్క్రతు లొప్పఁ జెప్పెను మహాసంకల్పముగా నాల్పతగా.

అంత వరునితో నాలోచించి యల గణానందుండు బ్రాహ్మణగోత్రమ్మున మొదట సదాశివదేవుం డన నొక్కం డావిర్భవించె. వానివలన నీశానదేవుం డును వానికి రుద్రదేవుండు ననంతరు లైరి. ఆరుద్రదేవుండు ప్రకృతిగా భూలోకాలంకారుం డైన యీ భవదేవుండు వెలసె నని వాని యన్వయంబు గీర్తించి, తొల్లి సత్యవతి యపత్యంబు గా నెన్నికఁ గన్న దాశరాజు వంశంబు జగద్విదితంబే కదా యని యందు యశం బందిన ధర్మ సధర్ముడు లగు సుధర్ముని పితృపితామహాదుల వర్ణించి యాతని గుణ వైభవం బెంచిన యనంతరంబ—

## శైవరత్నకన్యాపాణిగ్రహణము

ఆయతకీర్తి ధీవరనరాధిపుఁ డప్పుడు వేణుపాత్రి వి
ద్యాయిత గౌరి పేరఁ దగు నాత్మజఁ గూరిచి దారవోసె నా
త్మీయకరాంబుజంబులఁ దదీయ సుమాంజలిఁ గూర్చి శంభురూ
పాయ వరాయ తుభ్య మని భావన పేర్మి యపూర్వముం గనఁగా. ౪౯

అంతకుమున్న పన్నిదమ్ములు పఱచి నట్లు వెడవిల్తుండును వాని పడఁతియు వధూవరుల నావేశించి యాడింపఁ జూచుట సైపని మనముతో నష్టముసొచ్చిన భావవిశదీకరణప్రవీణయు ననుభావసమాజసమ్రాజ్ఞియు నుచితజ్ఞయు నగు త్రప యా యిరువురి మధ్యమునఁ దెర యను పేరఁ దజ్ఞధృత యై నిలిచి యబ్బురము గూర్చె. నప్పటికిఁ దనకు దైవబలమ్ము స్వల్పమగుటనో? సూత్రశ్రుతివలని భీతినో? నిలుకడకుఁ బట్టు లేమి నంతర్హిత యయ్యె నది యా దంపతుల నాదేశించుట మిక్కిలి కొనియాడ దగిన దయ్యె. నావేశించియు వారల మేనుల బులకమ్ము లను పేర వా రతికాముల శరము లిన్నికల వని వారల బండారము బయలు పఱచుట మఱింత దర్శనీయం బయ్యె. బయలుపఱిచియుఁ బ్రాకిడనున్న వారి

బలగ మ్మవు తదపాంగమధువ్రతప్పృథుకవితతి యడుగు సాగకుండ దా బెంపడి యగుట పెద్దయు గేయ మ్మయ్యె. నిత్తెఱంగున న బ్బలగ మ్మింత తెలివిఁ గాంచినఁ దా మఱింత పైఁ బడుచుఁ బడుచుదన మ్మెన సినఁ దాను మఱియుఁ బ్రౌఢత్వ మ్మెనయుచు నవి కుముదమ్ము లయినఁ దాఁ దమిస్ర యగుచు నవి కురంగమ్ము లైనఁ దా వాని పై స్వారిదీయుచు నవి యింత పెచ్చయినఁ దా నింకింత పైపై చ్చగుచు నవి యింత యొాహటించినఁ దా మఱింత సాహసించుచు సాముచేయు చున్నట్లు నాటక మాడుచున్నట్లుండఁ దల మిగిలి విజృంభించుచున్న యా త్రపకు లొంగిన ట్లున్న యా చూపుకోపుల కా విరివిలుహాల్చిన దంపతు లూఁత మ్యెసంగుట చూడఁదగియుండె. నా సమయమ్మున. ౫౦

ఇచ్చె గజంబు లిచ్చెఁ హరు లిచ్చెను దేర్లుపురంబు లిచ్చె సం
పచ్చయ మిచ్చె నిచ్చె సుమమానితవస్త్రము లిచ్చె దానులం
బొచ్చెము లేని కూర్మిఁ దన పుత్రికి నల్లున కల్ల ధీవరుం
డిచ్చెదుపట్టునం దనకు నేమియు నుంచక నిచ్చె హెచ్చుగఁ. ౫౧

వధువు గౌరి యయ్యె వరుఁ డీశ్వరుం డయ్యె
నాగమంబు మాట లట్టు లుండ
నుత్సవంబు కలిమికో యేమొ? దాశేశుఁ
డయ్యె హిమగిరీంద్ర మంతవాఁడు. ౫౨

ఆయుష్కరం బని యంత్రించి యపరంజి
తాళిఁ గట్టించె రత్నాళి మెఱయఁ
జూపు తూపుల గంట్ల సొద వాయ భవ్యాక్ష
తౌషధప్రక్రియ ననువదిచెఁ
బుత్తులఁ గని లోకముల జయింపుఁ డటంచుఁ
బాణిఁ బాణి గ్రహించు పాడి నెఱపె
నర్థార్ధసంబంధమా? యిది కా దని
యేకాననము నిర్వ రెనయఁజేసెఁ

జేయఁదగు పను లెడనెడఁ జేసి విప్ర
జాతిఁ బూజించి వారలచేత నిట్టు
లెప్పు డీ ద్వంద్వ మెనకంబు నెనయుఁగాత
మని తథా స్తనిపించె నెమ్మిని పురోధ.

ఏయెడ మంగళవాద్యము
లేయెడ గాణిక్యనాట్యహేలాగతులే
యేయెడఁ గవితానవతా
భూయిష్ఠవిలాసలాస్యములె యన నయ్యెఁ.

తదనంతరంబ—

సహజస్వాదుపదార్థసంకలన నాస్వాదాతిరేకక్రియా
వహపాకప్రవిభాగముం దెలుపు చర్వ్యశ్రేణి పేయావళుల్
బహులేహ్యాళి విలాసినీకరతలస్పర్శాతిరుచ్యంబు గా
బహిరంతారసరూపులై యనుభవింపం జొచ్చి రిచ్ఛాగతిఁ.

కూర లన్నము లప్పడమ్ములు గోఘృతమ్ములు పచ్చడుల్
చారు పప్పులు లేహ్యచూష్యరసాయనాదివిభేదముల్
చారుకాశిను లా యువాశలు సారసత్త్వము జెంద నిం
పారు మోదకలడ్డు కాదులు వడ్డనం బొనరించినఁ.

చూపుల కోపుల తీపుల
రూపుల ప్రోపుల వచోనిరూపితకలలం
గైపుల నిడు మరుతూపుల
సోపి యనుభవించి రాంధ్రు యువకులు నచటఁ.

భోజనక్రియానంతరంబ రత్నకంబళాస్తీర్ణవేదికాతలముల నున్న

లీలావతు లొసఁగిరి తాం
బూలీదళములును వక్కపొడు లొ ప్పపు తాం

బూలపు మాత్రలు పరిమళ
జాలంబులు దెసల కెల్లఁ జాల మెలపునన్. ౬౦

ముదమున విశ్రమ మొనసిన
పదఁపడి కవిగాతృ వారవనితానవతా
స్పదకావ్యగీతినాట్య
ప్రదర్శకం బైన సత్సభాస్థలులమరెన్. ౬౧

పెండ్లికూఁతురు పొడమిన విధము సోలిఁ
బెండ్లికొమరుని యపదానవిధులఁ గూర్చి
తద్వివాహంబువఱకు వృత్తంబు లెల్ల
నాశుకవితల వెలయించి రచటి కవులు. ౬౨

శ్రుతికిఁ దగు రీతి నవరణచొప్పు గన్న
గాత్రములు జంత్రములు నొప్ప ఘనరసైక
తానత పొనంగ గానవిద్యానిపుణులు
తేటగీతులఁ బాడి రచ్చోటఁ గూడి. ౬౩

భావ మనుభావసామగ్రి బయలువఱుప
రాగ మెనసిన గీతుల రాలు గఱగ
నాటలాడిరి వెలలకుఁ జోటు లిడక
వారనారులు మరువింటి నారు లనఁగ. ౬౪

అం దొక్క సుందరి యందఱ మించి హావభావంబుల నింబుగ నభిన
యించెన్. ౬౫

వీణకుఁ బోణిమి వెలయించు గాత్రంపు
మేలిమి శ్రుతులతో మేళవించి
ఘంటికానూపురక్వణనంబు వంటిన
యడుగడుగున లయ గడలుకొలిపి

శుకతుండముఖ్యహస్తకములఁ జూపెట్టి
లలితార్థచయము లెల్ల వెదఁజల్లి
నవిలాసవీక్షణ స్వాంతార్పణప్రౌఢి
నెమ్మి భావమ్ములఁ గ్రుమ్మరించి
ఈ లతాంగి నెఱపు నీ నాట్యకలఁ గన్న
గణిక పేరు దాచుకొనదె శివ ?
యేటి కింక నిలుచు నించు మించు బెడంగు ?
రంభ కింక నేటి రాజసమ్ము. ౭౬

అని మెచ్చుఁ గన్న యిచ్చఁ బొగడుచున్న యొక్క కవిపుంగవు న య్యంగన సాభిప్రాయంబుగ నీక్షించుట యుపలక్షించి మఱియొక కవీశ్వరుండు. ౭౭

కాసులకుఁ దూగుదాని
న్వాసిమెఱయఁ జేరఁదీసినాడవు బళిరే
సీసమున కాటవెలఁది సె
బాసుర యని యెల్లరఁ బకపక మనిపించేన్. ౭౮

ఈ విధి సంవిధానముల నేల్లపవల్ కడచన్న రేలు వి
ద్యావినయాది సద్గుణ నిధాన మతం డట బ్రహ్మచర్యముం
బావనవృత్తి నల్పె నిజభావినితోడ దినత్రయంబు ని
త్యావహితస్వధర్మ పరతాంశము లోకము వారి కెక్కఁగన్. ౭౯

అంతఁ బురోహితకృతనస్వస్తిప్రసంగసంగతుం డై భవదేవుండు ఫలదానా దుల సాఫల్యంబు సంపాదించుకొని పురంధ్రీసముపదిష్టమార్గంబునఁ గేళికాగారంబు సొచ్చిన యనంతరంబ నవలా లన్నవోష నలంకరించి మించిన కుతుకమ్మున గుసగుసలతో నెనకమ్మున సద్దెనకుం జేర్చి కర ణీయాంతరప్రశంసాపూర్వకంబుగ నచ్చోటు వాసి చనుటయు..... ౮౦

## ఏ కాం త ర హ స్య ము

విరులుం దమ్మిలములు న
త్తరులు న్మనైన నస్తుతతి గల గది యకా
మరుబాణపంజరమ్మునఁ
జొరఁబడి పరవశతఁ గనుట చోద్యమె ప్రజకుకా. ౭౧

ప్రీతి యను మరుని దూతిక
నాతికి నాథునకుఁ జిత్రనలభైమ్యాది
స్ఫీతరసవశతఁ జూపుచు
నా తతి నొగి నారితేఱు న ట్లొనరించెన్. ౭౨

వన్నలు మునిముని నగవులు
విన్నాణము లొప్పఁ బ్రౌఢవిథమున నపుడే
క్రన్నన సంలాపముఁ గొని
రన్నారియు నరుఁడు నర్థ మది వారికె కాన్. ౭౩

త ప్పానరించితిఁ గదవే
యొప్పులకుప్పా! యటన్న నొప్పులె కా కే
తప్పు లెటు లౌదవు మగలకు
నిప్పాపపుజాతి నెనయుటే త ప్పనఘా! ౭౪

తిట్టఁగవలెనే కూరిమి
పట్టిన్మద్దాడు నతిని ? ప్రాణప్రియ ! యా
పట్టేమిటి కౌదవెనొ ? మీ
గు ట్టెఱుఁగన్వచ్చు నె ట్లొకొండ్లకు ? దేవా!౭౫

నతి వన్న నీవ కదవే
పతిపై నపరాథ మింత పడనీ వతివా!

పతుల నయ మెఱుఁగుదొనొ ? యా
యతిధర్మము నొడువు పతికి నటు మనలెదనే ? ౮౬

కారణము గలదె దీనికి?
నారీమణి! కలదొ లేదొ నాథుఁడ యెఱుఁగన్
గూరిమికిఁ బాత్రమటె వీ ?
రీరమణా! యదియు నిడెదవో ? నా తలపై. ౮౭

అను భావినిఁ గౌఁగిటఁ గొని
యనుభావము వెలయ దేవి! యను మెప్పుడు నీ
యనుమతి లేకచరించితి ?
నని యనునయ మొనర సుఖసమన్వయ మెనసెన్. ౮౮

ఇవ్విధంబున నవ్వధూవరంబు తమ రహస్యవ్యాహారంబు తాత్త్వికగోచరంబు గా నానందానుభవ మెనసియున్నెడ న న్నెలఁత నెచ్చెలులు వీణియఁ బాణిం గొని కేలనుగా. ౮౯

ఎడయు గల్గినఁ గాని పే రెలమి లేదు
రాగమున కవిశేషత రహి నటంచుఁ
బగలు రాకుండ వీడ్కొనెఁ బతిఁ బునస్స
మాగమముఁ గోరి యామినీమానవతియు. ౯౦

అని సంగీతసామరస్యమ్మున నన్నసేయ నా యన్నుమిన్న యెట్టికేలకు నంతర్గృహంబు వెలువడి చనుదెంచిన— ౯౧

మూనుదుకొని చుట్టు వినుకలి
యెనలారఁగ గ్రుచ్చి గ్రుచ్చి యేమేమొ చెలుల్
గుసగుసలాడఁగఁ జొచ్చిన
బిసరుహలోచనయు సిగ్గు పెనఁగ నొదుఁగుచున్. ౯౨

చెలులార! వినుఁడు నా మన
మిల గొండలు గుహలు దాటి యేగెడు భూమం
డలమునఁ గనఁ దన యిచ్చకుఁ
బొల మగవడకునికి నేమి పున్నెమొ? యెఱుఁగన్. ౬౩

అట్లు మీరు వదలి యవ్వలి కేగిన
ముగ్ధభావ మెనసె మొదట నెడద
యేమి మాయ యొక్కొ? యెయిదె నిద్రాసతి
దాన నొండు కలయు గానన య్యె. ౬౪

అవియు నితరశ్రుతిగత కారా దని తోఁచెడు. నయిన నవిశేషత మీ కెఱిం
గించెద. రహస్యము రక్షణీయము సుఁడీ యని యపవారించి యేమేమొ
చెప్పిన యా మానిని బోధనైపుణమ్మున— ౬౫

దేవభూయ మెనయు తెఱఁగున నున్న యా
తెఱవ లెల్ల మఱచు తెల్విఁ గనిరి
తెల్వి పొడము కొలఁది దెసలు దోఁపమిఁ జేసి
దేవవృత్తు లెల్లఁ జేవఁదొఱఁగె. ౬౬

ఈ నయమ్మునఁ జిత్తరువుబొమ్మల విధమ్మునఁ గొంతసేపు నిశ్చేష్ట లై
యుండి తర్వాత వేలుపు లావేశించిన రీతిఁ గలఁగని మేల్కాంచినట్లు
నిశ్చిత లై నిర్మల లై యా లేమ లా దేవిని మహాదేవిని వలెఁ గైవారంబులు
సేయుచు నప్రమత్త లై యుపచరించుచుండిరి. ౬౭

ఆ కుమారగుప్తుఁ డా గణానందుండు
దెల్వి గాంచిరి భవదేవువలన
నింద తొందుఁ గూడి యిచ్ఛావిహారముల్
తవిలి యుందు రెడయు దశకుఁ గాదు. ౬౮

చూచితా యొకసారి చూచుచుందురు వారి
సొబఁగు వేఱొకసారి చూచువఱకు
వినిరేని యొకతేప వినుచునుందురు వారి
మినుకు లింకొకతేప వినెడువఱకు
తవిలిన నొకతూరి తవులుచుందురు వారి
తనువు లింకొక తూరి తవులువఱకు
యెనసినప్పటినుండి యెనయుచుందురు వారి
ఘనసౌరభము మఱి యెనయువఱకు
భువనమోహిని సుతఁ గని పొలువుగన్న
యల్లునకుఁ గూర్చి దాశేశుఁ డతని పత్ని
రనన నటు లుంచి హృదయసారస్య మెనసి
తన్మయతఁ గూఱి రఖిలసత్త్వములు మఱచి. ౮౯

ఈవిధమున నల దంపతు
లా వీ డా పరిసరం బనస్యోత్సవపా
రావారమగ్నతం బ్రిదిఁ
వావానము తుచ్ఛ మన్న హాయిం దేలెన్. ౯౦

అమ్మోయిం గొంత సమయ మ్మరుగ నొక్కనాఁ డేకాంతమ్మున భవదేవు
కనునన్నుఁ గుమారగుప్తుండు సుధర్మున కి ట్లనియె. ౯౧

ప్రయాణసన్నాహము

భవదీయవైభవమ్మున
నవిరళసౌఖ్యముల కగుచు నన్ని మఱచు తేఁ
కువ నుంటి మిన్నినాళ్లుం
బవిత్రతమ! నీ చరితము పావన మరయన్. ౯౨

చాల కాల మయ్యె న్వనగరముం బాసి
యెదురుచూచు వార లెందరొక్కొ?

యెట్టు లయ్యె నొక్కొ ? యింటి పరిస్థితుల్
పోయి వత్తు మయ్య పుణ్యమూర్తి ! ౧౩

అదియుఁగాక వధూగృహప్రవేశాది శాస్త్రాచార సమాచారంబు ననుల్లంఘ్యము కదా. ౧౪

కావున మమ్ముఁ గాంచు నెనకమ్మునఁ గన్నులు మూయకుండ మా
త్రోవలె చూచు బాంధవులతోడ మహోత్సవసంవిధానసం
భావన సేత కిప్డె వెనఁ బంపుము నింపుము కూర్మి రామొ ? పో
మో ? విచికిత్స లేల ? భవదుక్తికి మేకొనకుండువారమే ? ౧౫

అని విన్నవించె నా ముఖ
మున భవదేవుఁ డని యుచితముగఁ బలికెడు నా
తని వాగ్వైఖరి వినినం
తన నెడఁదన్ రాయి వడియె దాశేశునకున్. ౧౬

అట్లు దిమ్మరవోయి కొంతతడికి తెలివిఁగొని సుధర్ముండు విచారింతము మంచి దినములు కుదురవలదా ? యనఁ గుమారగుప్తుం డిప్పుడు దిన శుద్ధి నెఱింగియు యడిగెడు మన విశ్వసింపక గణానందు నప్పుడ రావించి యడుగుటయు నాతండు రేపకడ సర్వవిధమ్ముల నుత్తమోత్తమ్మగు లగ్నం బని నిరూపింపఁ జిన్నవోయిన నెమ్మనమ్మున నమ్మహాత్ముం డప్పటికిఁ దలయూఁచి తరువాత సంతిపురికిం జని యెదురువచ్చి యుపచరించు తన సాధ్వితో ససాధ్వసుఁ డై మహాపాతక మ్మొనర్చినవాని చందమ్మున సర్వస్వముఁ గోలుపోయినవాని రీతి నాననంబున దీనత దోఁప.

మన భవదేవుం డమ్మా
యినిఁ జేకొని స్వపురమునకు నేగెడునట రే
పను నాథు బాష్పగద్గద
ఘనవచనము నిలువు నీరు గా నొనరింపన్. ౧౭

ఆ పతిదేవతాతిలక మట్లు కలంగి విమోహితాత్మ యై
చేపడి తెల్విఁ గాంచి వెతఁ జెందుచు బాంధవబంధబద్ధ యై
యోపక వేఁడియూరువుల నొప్పు నిజాధరపల్లవంబు సం
తాపముఁ జెంద నాథువదనంబునఁ జూడ్కి గదిర్చి యిట్లను౯.

ఇచ్చమై విహరింప నచ్చువో? యిచ్చటి
సూనసుగంధిలోద్యానవనులు
లీలమైఁ గ్రాలంగఁ జాలవో? యిచ్చటి
మదమంథరగతద్విరదనతతులు
పూని వినోదింపఁ గానరో? యిచ్చటి
గానకవిత్వవిజ్ఞానఘనులు
తఱిమి త్యాగము సూపఁ దఱుగునో యిచ్చటి
రత్నాకరచిరత్న రాజ్యలక్ష్మి
లేమి తక్కువయో? తమ కిచట నున్నఁ
బ్రేమ గల చుట్టములఁ బిలిపింపరాదొ?
యిట్టు లెడవెట్టి చన హేతు వేమి కలదొ?
యెడసి తా రేగ మనకు నిం కేమి కలదొ? ౧౦౦

అని సోత్కంఠతఁ బల్కు కల్కిఁ గని ధైర్యాహార్యుఁ డౌ దాశభూ
జననాథుం డొక కొంత తేఱి లలనా! సంసార మీ దారిదే
యని యీ సారికిఁ బోయిరాఁ బనిచి సౌహార్దంబున న్వారి నీ
మనికిం జేర్చుటొ? చేరుటో మనము తన్మార్గంబు? నూహించెద౯.

అనుచు మనసు కుదుర నాడి పూఁబోడి నొ
ప్పించి లోకసరణి సేంచి మించు
ధైర్య మంచితముగఁ దాల్చి ప్రయాణ స
న్నహనమునకుఁ దగిన మహ మమర్చె. ౧౦౧

విందులు సేసిరి బందుగు
లందఱకుం దదుచితముగ నల్లుఁడును గణా
నందుఁడు కుమారగుప్తుఁడు
డెందములం దలర సంగడీంద్రుం డారుఁ. ౧౦౩

కలిమి కొలఁది మీఱఁగాఁ బ్రేముడి దలిర్పఁ
గట్టఁ బాయఁ దొడుగఁ గా నగు తగు
వస్తువితతు లెల్ల వారికి నిడి విశే
షించి వధువరుల కశేష మొనఁగె. ౧౦౪

అల్లున కొప్పగించి యురు నందలమం దిడి కాఁతు నీతులుం
జెల్లఁగఁ గొల్లగా నొడివి చెచ్చెర రం డటవోయి యంచు మా
యుల్లము మీర కొం చరుగుచుంటి రటంచు వచించి పాయఁగా
నొల్లక వాల దవ్వు చని యుండక తప్పని యట్టి పట్టునఁ. ౧౦౫

ఉందు మింక ననిర యుబ్బాష్పగళము ము
వ్వంక లొలయు స్వరముఁ బ్రసరింప
దాశుఁ డతని సతియు ధైర్యమ్ము లుడివోవఁ
గనుల నిండ సలిలకణము లూర ౧౦౬

అట్టి దశకె యగుచు నవ్వారు వోయిరి
వీరు చూచి చూచి వెనుక కొదిఁగి
రిదియుఁ దప్పు దెవరికేని నీశవిలాస
మింద కలదొ యేమొ ? హృదయ మెఱుఁగు. ౧౦౭

ముక్తిఁ గోరి బంధము నెడల్చుకొనువారి
కిదియు నొక్క దారి యింటి వంక
నేమి గాంతు రింక ? నెటు కాలముఁ గ్రమింతు ?
రన్నయ వియు విడుచు టురవు కాక. ౧౦౮

అట్టు లరిగి వారలా యాయి తలములు
శూన్యములుగ దోఁపఁ జూచి చూచి
హృదయ మదరుచుండ నిదురకు నాకలి
కెడపడంగనై రహీనులార! ౧౦౯

అను నా సూతుని మినుకులు వినుకలి జ్ఞాననిష్ఠాదులును దదవస్థం
జెందియుఁ దెలివిఁ దెచ్చుకొని మహాత్మా! మొదలింటినుండియు నియ్యో
దంతమున కెదియో మూల మున్నట్టు లచ్చు టచ్చుట స్ఫురించుటయే
కాని విశదము కాలేదు. ఇంతవాఁక రసవశమున మనము లా దెనకుం
బ్రసరింపలేదు. ఇంక నిందలి విశేషంబు వివరింపవలయు నని యర్థిం
చుటయు. ౧౧౦

హరిహరచరణాంబుజబం
ధరాయమాణస్వహృదయ! పరిశీలితభూ
మరహస్య! ముఖ్యనాడీ
పరిశోధనవిత్తలాఘవప్రతిపత్తీ! ౧౧౧

కోపవికారవికుంతనమార్గ
ప్రాపితధర్మవిపాకకలాంచ
ద్దీపరిపాకవితీర్ణవివేక
శ్రీపరతత్త్వవిశిష్టవిచారా! ౧౧౨

ఇది శ్రీమద్రామకథాఽమృతకవికుమారహనుమాంబాశమీగర్భహవిర్భురాయ
మాణ శ్రీదేవీసేవ్యమాన రాఘవనారాయణాభిధాన కవి గ్రథితం
బగు కల్యాణకైవర్తకం బను ప్రబంధంబునఁ
జతుర్థాశ్వాసము. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# కల్యాణ కైవర్తకము

## పంచమాశ్వాసము

శ్రీ చెల్లయశాస్త్రి ప్రవ
రాచార్యక వైఖరీ సమాసాదిత వి
ద్యాచర్యాప్రాచీనా
నూచానాచార సార! సుత్రాజ్ఞానా! ౧

సావధానుండ వగు మ త్కథకుం డక్కులపతుల నందియంబుల వి
వ్విధంబున నిర్వహింపం దొడంగె. నంత నొక్కనాఁడు. ౨

### ఒక మునికి వానప్రస్థ దంపతులతో ప్రసంగము

భూతిచే నాత్మానుభూతిచేఁ దన యొడ
లత్యచ్ఛతా మహార్హతలఁ జెందఁ
దపముచే మిహిరునాతపముచేఁ దన మోము
బ్రహ్మవర్చస మహాప్రభల నీన
యమముచే మించునుద్యమముచేఁ దన మది
విరతతోత్సాహవైఖరుల నెనయ
నటలచే వైదికనటలచేఁ దన వీణ
నవరాగ గీతినంతతులఁ గొలుప
నంచితం బవు గుంచెయు నక్షమాల
యునుఁ బ్రకాశింప నొక్క సన్మునివరుండు
భావనాతీతచిత్రభావప్రపంచుఁ
డల్లనల్లన వెడలె నొం డడవియందు.

తలిరుంజొంపము లందుఁ గ్రొంజెలిమి మోదం బందుచున్నట్టి కో
యిలజంటం గని దాని పల్కుఁజవి నే దేఁ బల్కి యా రెండు వెం

గలు లై కూయుచుఁ బోరుచో నెడద వేడ్కం జెంది యా జోటి నా
చెలికారంబునఁ గూర్చి సాగె నగవుం జెయ్వు ల్పురాణింపఁగన్. ౪

చని తపముసేయు శైవవైష్ణవులఁ జూచి
శివుఁడొ? పారమ్యమతుఁడు కేశవుఁడొ? యనుడు
నుభయులుం బూని పానరించుచున్న వాద
మాలకించుచు హర్షించు చచటువాసె. ౫

ఇటు చనుచున్న యమ్ముని మహేశ్వరనామనితాంతసంస్మృతి
స్ఫుటదురుయోగమార్గగతి పూర్ణవివేకమహాని నంస్కృతి
త్రుటనపరీతసత్క్రియు నరు న్వనితానఖుఁ దద్వనస్థు న
చ్చటఁ గని నెమ్మదిం దలఁచెఁ జయ్యన నయ్యెడ నున్న నెయ్యమున్

అంత మనంబున నిముడని
సంతసమున్ నాల్క నిల్వఁజాలని పలుకున్
గంతులిడఁబోవు పదయుగి
నంతర్గతి నాగుచుం దదంతిక మెనసెన్. ౬

వచ్చిన నమ్మునీశ్వరుఁ గాంచి పండువు
వచ్చినప్పటి భంగి నిచ్చఁ బొంగి
వనితయుఁ దా నెదుర్కొని వందన మొనర్చి
యర్ఘ్యపాద్యాదుల నాదరించి
రాక యెచ్చటినుండి? రాఁ గతం బేమి? యం
చెట్లు ప్రశ్నింప నౌ? నెఱిఁగి యెఱిఁగి
మిముబోంట్లు సర్వతోగమనులు తోఁచెద
రవ్వారి కెవ్వారి కయము దఱియు
భవిక మెఱఁగించు నొక్క తపస్వి యనుచు
దివ్యవాణి వచించె నంభావ్య! కాన
నమృతముం జిల్కు నీ పల్కు లర్థి వినుట
కన్న నైహిక మాముష్మికమ్ము కలదె? ౭

అని యడిగిన తన పతివా
క్కునకుం దగు నుత్తరంబ కోరుచు సతియుం
దన నగము పులుగుపలుకున
ఘనుఁ గోరిన నుప్ప తీప కరణిగ నుండన్ ౯

ఘనులార! వినుఁడు శుభ మీ
దినమున నెనసెదరు మీరు దేవరహస్యం
బునకు న్సత్కృవికృతిక
ల్పనకుం దుది మొదలు దెలియవచ్చునె యెందున్? ౧౦

అని యొక గీతమును వి
ప్పెను మునిచంద్రుండు లోకవిశదము గాఁగన్
జనతానుతముగ వినినం
తన మోద మెసంగఁగల కథాసుధ వెలయన్. ౧౧

సరసిజసంభవుండు మతిసారమసారససారచారుతా
దరమున మున్ సృజించె జనతావృత శైలపయోధరన్ సరో
వరనతనాభి హారిశుచివారినదీనదభూరిహార సుం
దరతర భూతధాత్రి యన దాని నెఱుంగకపోవ రెవ్వరున్. ౧౨

దాని చుట్టుముట్టి తద్దయు నొప్పారు
వెలగల మొలనూలు పేట లనఁగ
రసవిశేషకలన రత్నాకరము లేడు
వర్ణనీయము లయి వానిలోన. ౧౩

శ్రీలతాంగిని గన్న శంపాలతాంగి
యాలు గా నెల్లజగముల కాలవాల
మై లసద్రీతి వఱలు నిత్యప్రశస్తి
పాలమున్నీ రసంగ సంపదల చాలు. ౧౪

అల పాలవెల్లి సురలుం
బలలాశనులుం గడంగి వడి ద్రచ్చెడిచో
వెలసిన మీఁగడ గని యనఁ
దెలిమీఱెడు దీవి యొండు దివిరెడు నడుమఁ. ౧౫

అద్దానిఁ జుట్టి యలరెడు
సుద్దామస్ఫటికమరకతోజ్జ్వలరత్నాం
చద్దీప్తివిభ్రమితదృ
ష్ట్యద్దానవదృష్టి యైన వప్రావళియుఁ. ౧౬

ఆ వప్రావళి మధ్యభాగమున సుద్యానోచ్చలద్బాలలీ
లావాత్సచిత్రప్రియహారయవిశాలప్రాభవామోదన
ద్భావోద్భాసితభర్మహర్మ్యమయ మై భాసిల్లు నిచ్చాలన
ద్భావవ్యాపృత మొక్క వీ డమలవిద్యాప్రాయ సందర్భమై. ౧౭

అఖిలసజ్జనకర్త యగు నజుఁ బుట్టింప
నోపెడుఁ దెల్వి నొక్కొక్క నరుఁడు
నరుని చూడ్కులకునబ్బురముఁ గొల్పఁగ జాలు
హొయలున వెలయు నొక్కొక్క పొలతి
పొలఁతి మై సిరి వెంచు పూఁదీవ కల గాలి
నొలయు కు ల్కొనఁగు నొక్కొక్క వనము
వనము మేలునకు నెమ్మనము మెచ్చఁగనీని
యొద్దిక సమరు నొక్కొక్క మేడ
మేడ కలిమి వెలయు జాడ నెక్కొను శుక
శారికామయూరసంచయంబు
సంచయంబు యయిన సౌఖ్యంబు నాఁగ న
వ్వీడు తోడు లేక విఱ్ఱవీఁగు. ౧౮

తరువునఁ జివురుపగిది నం
బరమున నెల యట్లు తీవ మంజరి పోలెం

జెరువునఁ జామర వలె న
ప్పురమున నంతఃపురమ్ము పొలుపున వెలయున్. ౧౯

నవనవోల్లాసమౌ తదంతఃపురమున
కవుల ప్రతిభాలతాంగిచేఁ గాకపోవు
నట్టి న్యూనోక్తి కలుగు మహార్హసౌధ
రాజ మొండు విరాజిలు తేజ మెఱసి. ౨౦

కలరవంబులు గూడి యుత్కలరవమునఁ
దప్పలభికనాటములను వేదములు చదువు
లేమి చిత్రము ? తద్ద్వారభూమిఁ గురియు
నెన్నియో ? క్రమాఁకు లర్థిసమీహితములు. ౨౧

ఆ వాకిట నివసింతురు
ధీవరు లై కర్మనిష్ఠ దివ్యతఁ గను భూ
మీవిబుధులు సుఖపరు లై
యావిబుధులకన్న మిన్న లై సంపదలన్. ౨౨

దాని కవ్వల రెండవు ద్వారము కల
దచట భార్యాపతిన్యాయ మనువరించి
యాద్య వైకుంఠు సేవించి నట్టివార
లనుభవింతురు తమ కిష్ట మవు విభవము. ౨౩

మూఁడవు కక్ష్యాంతరమునఁ
జేడెలతో గూడి యా విశిష్టాద్వైతుల్
స్వీడితదామోదరు లా
పోఁడిమి మించెదరు సౌఖ్యముల లా మనఁగన్. ౨౪

ఘనతఁ గాంతురు నాలవ కక్ష్యయందు
మొదటినుండి విరక్తు లై మోదలీల

స్థిరపదార్థముకొఱకు నంచితముఁ గూర్పె
నైన యుపధూతవర్యు లాహ్లాద మొప్ప. ౨౨

పంచవింశతితత్వపరికరమ్మున సర్వ
సారు భావనసేయు సాంఖ్యవరులు
కరచరణాద్యనుగ్రహమోదయుతుని గాఁ
బరము విచారించు పండితులును
యమనియమాదినియతి సహస్రావస్థ
హంససోహంభావ మరయు యోగు
లల శాంభవీముద్ర వలచి జన్మాది పా
రముఁ గాంచు రమఁ గన్న రాజయోగు
లాత్మహితవృత్తి వర్తింప నలరు నపగ
తాఖిలార్తులు వరుస నా యైదు నాలు
నేడు నెనిమిది యగు కక్ష్య లెంచరాని
వైభవంబుల కివియ యా భవనము లన. ౨౩

తదనంతరమున సౌఖ్యా
స్పదము శుభాలయము రత్నచారుమరీచి
ప్రదము వచోతీతము నం
మదపూరము నాగ గేహమధ్యం బమరుఁ. ౨౪

ఆగేహంబున శయ్యా
భోగము గా భోగిరాజు భోగ మిడి శిరో
భాగము గొడుగుగ సమరిచి
లోఁ గుండెడు వీవఁగఁ జెవులుఁ లేకునికిన్. ౨౫

మించు పాపఱేని మేఁదీవ పొన్నున
మేలి సీవిరులను గేలఁ దాల్చి
యతివ లుపచరింప నల్లారుముద్దు గాఁ
బవ్వళించు వొక్క పదముఁ దెలమి. ౨౬

ఆ నెలవుకలిమిఁ బ్రాప్త
ప్రాణము లై చెలఁగు సాలభంజికలను స
ర్వాని యెలమిఁ జిగిఁ గన
సూనిన స్తంభాఖ్యభావ మున్నటు లుంచున్. ౩౦

ఆ నవమోహనాంగు హృదయాంగణసీమ నెనంగు వైజయం
తీనవహేలికాంతరవనిస్థితకౌస్తుభపీఠి నొక్క రా
జానన కేలుదోయి నరుణాబ్జయుగంబు దరించి యుంచితా
నూనవికాసభాసురతసూరుహ యై నత మూఁగుచుండెడున్. ౩౧

అతని పాదయుగము రం
భాతరుతులితోరుల నిడి భక్తిశ్రద్ధా
న్వితముగ నొత్తుచుందురు
శ్రీ తరుణికి నీడ లైన చెలువ లిరువురున్. ౩౨

సాంద్రతరభక్తియోగం
బింద్రాదులకన్నఁ దనకు నెనక మొనఁగ ని
స్తంద్రుఁ డయి వాని మదిఁ ఐ
క్షీంద్రుం డొకఁ డనుసరించు నీప్సితసేవన్. 33

పాడుచుందురు గంధర్వవరు లొక యెడ
నాడుచుండుదు రొక్కచో నచ్చరకొమ
లొక్కవంక విభు నుతించు నొడళులఁ గొని
శ్రుతులు మౌనులు తలలూఁచుచు న్వినికొన. ౩౪

భానుకోటిప్రభాభాసమాన జన న
భాజనార్హ తదీయసభాస్థలమునఁ
గూడి ముప్పదియును మూడు కోట్లు దివ్యు
లెలసి సేవింతు రెడ నెడ మెలపుతోడ. ౩౫

ఋతువు లాఱును సంతతప్రీతి సార్వ
కాలికలతాంతనిచయసౌగంధ్య మొసఁగఁ
బొదివికొని వచ్చి వాయుదేవుం డొనర్చు
నెలమి బొలఁకఁగఁ దత్పదమ్ముల సమర్చ. ౩౭

ఒకనాఁ డే నిలనుండి దేవపథమున్ దుత్సాహి నై యేగుచో
సకలంకాత్మకలుండు తుంబురుఁడు వీణాన్వితుఁ డై తోఁచ దే
నికి నెచ్చోటికి నేగెదో యనినఁ దన్వీయుక్తు నారాయణుఁ
సకలాత్ము న్గొలువంగఁ బోయెదఁ దదిచ్ఛాభావితాత్ముండ నై. ౩౮

అని చెప్పిన నరిగితి నే
మును దద్దర్శనము సేయ నూతనవృత్తిన్
మన మురియాడఁగ నిరువుర
మును జని నతు లెసఁగ దదభిముఖవచనుల మై. ౩౯

## విష్ణుస్తవము

రాక్షసు సోమకుం దునిమి త్రచ్ఛ్వమలం బయికెత్తి యా హిర
ణ్యాక్షు వధించి పై సతని యన్న నడంచి బలీంద్రుఁ ద్రొక్కి క్ష
త్రక్షయ దీక్షఁ బూని యల రావణుఁ జంపి ప్రలంబు నొంచి ప్ర
జ్ఞాక్షతి మించి కల్కిపద మందిన ని న్నెదఁ గొల్తు మెచ్చుచున్. ౩౯

ఆ మ్మనుజాధినాయకు లహంకృతి మీఱిన భూమి కైన భా
రమ్ము సహింప లేక యదురాజకులమ్మునఁ బోచి ధర్మప
క్షమ్ము వహించి దుర్జనులఁ జంపుచుఁ గృష్ణుఁడ వయ్యు సర్వలో
కమ్ము సిత మ్మొనర్చితివ కాదె యశమ్మున లోకనాయకా! ౪౦

సత్యవుఁ దెల్వి లచ్చికిని సమ్మదముం గలిగింప నెంచి యా
దిత్యవనంబు నాఁ జను శ్రుతిప్రచయమ్మునఁ జొచ్చి కల్ప మన్

నిత్యపదార్థకల్పనల నింపెడు గీతను దెచ్చి యర్జునా
ఖ్యాత్యమలస్వభావునకు హాయిగ నీయవె ? నిత్యనిష్క్రియా ! ౪౧

ఆది సురాసురార్థముగ నంబుధిఁ ద్రచ్చి మనోరథంబులం
బ్రోది నొనర్చు భూజపశుముఖ్యములం గలిగించి పై దయన్
వేదపయోనిధిం దరిచి విజ్ఞులు కోరక కోర్కు లీయ వ్యా
సాదిమునీంద్రరూపమున నాగమకల్పము లుర్వి నిల్పవే ?. ౪౨

అది యిది యన నేటికి ? తుది
మొదలును లేకున్న నీడు ముచ్చటఁ గాదే
మొదలుఁ దుదిఁ నెనయు జగ మ
య్యాదియును గన నీవ కావె ? యంబుజనయనా !. ౪౩

అని యిట్లు హర్షబాష్పము
లనుపద మెతలంగఁ బొగడ నైన మముం గ
న్గొని యు వ్విభు కనుసన్నలఁ
గనకమయాసనము లిడిరి కాంతలు చెంతన్. ౪౪

అంత నా దేవు సప్రసాదాక్షివీక్ష
ణముల మైగగు రొదవ విన్ననువు దోఁప
నాసనమ్ముల నుంటి మ ప్డాహరించెఁ
దొలిఁ గలావతి చోలంబుఁ దుంబురుండు. ౪౫

నారద తుంబురుల పాట

విశదభావంబున వినవచ్చు స్వరగతి
పంచాస్త్రు వాహంపుఁ బలుకు గాఁగ
నవ్యక్తమధుర మై యలరించు నలతావు
కోయిల కూకూల కులుకు గాఁగ

సనుబంధ పరా శ్రుతిస్వనము దోఁచెడు చోటు
కెలని తుమ్మెదల ఝంకృతియుఁ గాఁగ
హాయి నొసంగు న చ్ఛాయి పొద యొక వింత
జాలమాలతుమతల్లిల గాఁగ
రాగ మెసఁగ పల్లవినీగణములఁ
గృతు లనం దగు శాఖిసంతతుల వెలయు
భావమాధుర్యధుర్యవీణావనంబు
మనిచి ప్రోయించెఁ దుంబురు మాధవుండు. ౪౬

పులుఁగులు పలుకులు మానెం
గల యంతట యింద్రియప్రకాండము నిజవృ
త్తులు మఱచె సలఘుతుంబురు
కలిత లలిత మూర్ఛనాఢ్య గానము వినుచోన్. ౪౭

అందియల ప్రోతయుం గడియముల కంక
ణముల క్వణనము గలిగి వీణ యను పేరఁ
మించు సౌధంబు సప్తభూమికల సకల
లీల మెఱసెను గానకళాలతాంగి. ౪౮

రాగాలాపము సేయుచోఁ గను రమారామోష్ఠ మా మూర్ఛనా
భాగంబుం గని భోగిరాజు తల సంభావించుఁ గృత్యంగనా
యోగం బెంచినఁ గాంచు సత్కృతికిఁ గా సుశ్రీ కుచాభోగభా
గ్రాగాశ్మాంచితమాలికావళుల న క్కల్యాణుఁ డుల్లాసి యై. ౪౯

విహిత మవు నతని గానం
బహహా యని మెచ్చి నమయ మపుడు తెలుప నా
మహితుండు నారదా! యన
మహతికి చైతన్య మమరు మాదిరి యయ్యెన్. ౫౦

లేచి తనకన్న మున్నుగ వేచియున్న
గపడుఁ జూడక క్షీరసాగరశయనుఁడు
ద్వారదేశంబువాఁక తా నరిగి నిలిచెఁ
బ్రబు విధ మెఱుంగ కెల్లరు బమ్మరిల్ల. ౫౩

శ్రీ రంజిల్లెడు వాని వక్షమున వాసిం జెందియుం దన్మనః
ప్రారంభం బిసుమంత గానక భయభ్రాంతాత్మవృత్తాంత యై
సారం బౌ స్తుతి సల్పఁ జిన్నగవుతో శ్యామాంబువాకారుఁ డా
ధీరుం డెప్పటి యట్ల చేరె ఫణినిర్దిష్టాత్మశయ్యాస్థలిన్. ౫౪

ఆయెడ నున్న నవస్యల
కా యన్నుల కన్నుచే నన క్తముకానీ
యా యనఘు లేచినప్పుడ
పోయిన ప్రాణములు వచ్చి బొందులఁ జొచ్చెన్. ౫౫

నవిధమున నున్న నేను నుత్సాహ మొప్ప
మున్న ప్రార్థించి యడిగితి మురవిదారి!
యఖిలలోకైకనాథ! నీ కయిన నంభ్ర
మంబునకుఁ దెల్పఁగదె కారణం బటంచు. ౫౬

ఆ మాటకు యోజించుచు
దామోదరుఁ డనియె దేవతాగోప్యము నే
నేమి తెఱఁ గంచు ననియెద?
నామరమౌవిప్రకాండ యుని న వ్వేలయున్. ౫౭

నేనును జనవరి నగుటన్
శ్రీనాయక! సురరహస్యరీతి సురలకుం
దా నెఱుఁగరాక యుండునె?
పోనీ వినిపింప నమరమునికిం దగదే. ౫౮

అనుచు వెంబడింప నాతండు వెండియుఁ
బలికె నిట్లు గభీరభాషణములఁ
దమ్మి కమ్మనీరు ద్రావు తేఁటుల పోల్కిఁ
దక్క మఱచి తత్సదస్యులుండ. ౨౯

## విష్ణువాక్యము

చెప్పవచ్చున కాని నీ చెవులఁ బడినఁ
దెలియకుండునె దివి భువి దిగువనేని
నైన నడిగితి దాచఁగా నౌనె నీకు?
వినుము వినిచెద నారద! మునివరేణ్య! ౩౦

తనతండ్రి హిమమహీధరుఁడని ధరరాజ్య
మీశాని వానికి నీయదేని
తమ నెల వని బుధుల్తమి మేరుగిరి నిడి
బంగరుమల యంచుఁ బలుకరేని
తనరిన వింజ మట్లొనరద యిది యగ
స్త్యున కని శివుఁ డాఁగి యుండఁడేని
తమ నేర్పుఁ జూప సత్కవులు కల్పనలలో
రాజతం బిది యని వ్రాయరేని
వనము ప్రోవు విభుని హాసమ్ము రాశియు
సత్వగుణము కన్న చక్కదనము
నొండు రూపు దాల్చి యుండునే? యెందు నా
వెండికొండ కెన మఱొండు కొండ. ౩౧

కలుములఁ దులకింపఁగల రతనాల పా
తర లెన్ని సిరులను దాటలేవె?
నలకూబరుం డున్న యలకాపురకిరీట
మౌన్నత్యలక్ష్మికిఁ జెన్నుకాదొ?

దాన నిరేను జగములఁ బొల్చు శూలి
శివు మహత్త్వముఁ గొనియాడఁ గవివశంబె. ౬౭

జడిగెఁ గా కా వన నగునె ? యంచును గూర్చి
బాలుని యింటఁ గావలికిఁ బొచ్చె
బ్రదుకఁగా నమృతంబు వాంఛించు సురలకై
యఖిల మెచ్చు విషంబు నారగించెఁ
గోరఁగా యని తన యూరు కుబేరున
కర్పించి పిత్రుపనమందు నిలిచె
నా తపంబున మెచ్చునాఁ కరిఁ దనకప్పు
నెక్కుడేఁ గా వర మిచ్చి పుచ్చె
నెవటి మేష్మను వన కీతు తెన్ని గలవె ?
యన్నియు నెనప్పె నివి యని యనఁగనేల?
తలఁప నే వేల్పులకును నే పాతలకును
జగతి శంకరు నౌదార్యసరణి కలదె ? ౬౮

అమరులలోన బ్రహ్మయుఁ దీవ యొటంచుఁ
బల్కి ఫీ నెక్క బ్రాఁబల్కు వాన
విశ్వాధికుం డయి వెలయు మహర్షి దు
ర్మమం దనె నావృతి శ్రుతి యొకర్త
నేను విష్ణుఁడఁ గానిచో నెట్లు శివతత్త్వ
మరయఁగల్గుదు ? ననె వ్యాసమౌని
నను మహాపూరుషుం డని మహాదేవుఁ గా
నతనిఁ గీర్తించు సర్వాగమంబు
లన్నిఁటిని మించు మృత్యుంజయత్వ మెన్న
నేను మొదలుగఁ బశువుల పైన మనకు
నాతఁ డొక్కండె పశుపతి యనఁగ నయ్యె
నిట్టి శివతత్త్వ మెఱుఁగంగ నెవరి తరము. ౬౯

అపరతత్త్వ మౌ భవుఁ డహార్యతనూభవ వామపార్శ్వమం
దాపితలీల యై కొలువ నంకమునందుఁ గుమారు లిద్దఱుం
జూపులకు న్ముదం బొనఁగ శోభనలీలల భూతసంచయుం
బోఁ భజింపఁగా సురసమూహముతోఁ గొలువుండె నిండుగన్. ౧౮

ఇటు లున్నెడ నాదేవుని
నిటలమ్మున గండములను నెక్కొనెఁ బులకల్
దిట వెనయు నతివ మోమున
పటుదృష్టి నిగుడ్చి యద్రి వలె కణ ముండెన్. ౧౯

అంతకు స్వాంతములందు ని
తాంతము తెల్వని హరించి తత్పరతమెయిన్
సంతసమొ ? సంతమసమో
సంతతమై తోఁచె సచటి సభ్యుల కెల్లన్. ౨౦

అప్వ డల్ల మహాదేవుఁ డనియె సుదతి
కొక యపూర్వపు ఫక్కి వాచికము నెనయ
నశనిఁ గురియంగ నుఱిమెడు నంబువాహ
మఱగనని తెల్వి ముందర మెఱసినట్లు. ౨౧

ఇలఁ బుట్టుచు గిట్టుచుఁ దె
క్కలిఁ గను జనులెల్ల మోక్షకలన నెనంగం
గల శ్రుతిమార్గము దెలిపెదఁ
బొలఁతీ వేగంబ గ్రంథముల నందిమ్మా. ౨౨

అని నాథుండు వచించుచున్నయెడ వేదాన్తం బనన్ లోకమం దున యే రేఁ గను పాలుమాలికనొ ? యా దుష్కాలమే చేయు చె య్యునసొ ? తద్భవితవ్యతాదృతినొ ? పూవుంబోఁడి తత్కాలసం జనితప్రేమఁ గుమారు ముద్దుఁ గనుచున్ జాప్యమ్ము మై నుండఁగన్.

ఆ తిగకంటినొసట సెగకంటి జిగి మిగిలిన రెంటికిం దిగియుచు రతికాముల విండ్లు రెండు నేకముసేసి క్రోధునకు వి ల్లమర్చి మొగము జేవురింప నంగములు పొంగువారఁ జెంగటివార లనంగుం దలంచి యంగలార్ప నుత్తమాంగంబునం గల కళావంతుం డంగద వెలరువాఱ నంగంబుల భుజంగంబులకుం బాఱిపోవనుం గాళ్ళువచ్చినట్లు గా నంగీకృతయగు గంగాదేవియు బ్రుంగుడువడం గంగవం గానక తొంగితొంగి కనుంగొనం గుత్తుకలోని జంగూలంబు రంగు మాఱి తుకతుక మని పొంగఁబుడమి వడంక జలంబు తెట్టలు గట్ట నగ్గి బొగ్గువాఱ గాలి కువంగంబు తీసిన దారిం బడి తొలంగ నభంబు బూరటిల్ల జంగమస్థావరంబులు విపరీతంబులు గా సిద్ధులు దేవయోనివిశేషు లఖురూపంబుల నణంగియుండ లోకం బాకులంబు గా లెక్క లేని పగలువత్తు లొక్కసారి వెలింగించినట్లు రోదసీకుహరం బెల్లఁ దెల్లవారి శబ్దాయమానం బగుచుండ నిక్కి యొక్క యట్టహాసంబు సేసి పట్టిపలని బిట్టలుక గట్టులదొరపట్టిం జూచి యోసీ! పాదంబు వట్టినను సేవించినను లంచ మిచ్చినను మంచిసేసిననుఁ బ్రార్థించినను విచారించి గాని యధ్యాత్మవిశేషం బెఱింగింపరాదు. అట్లుండఁ గేవల మగు కరుణ నే నుపదేశించెద నన్నుఁ గుమారు ముద్దు సూచుచు ననాదరంబు సేసితి గాన ఫలం బనుభవింపుము. "నీ వొక్క కైవర్తనాథునింట" అనుచుండ నర్ధోక్తిలో నయ్యర్ధాంగలక్ష్మి వెన్నగవుతో నొకవిధంబునఁ దోచి కొన్నినాళ్ళుండెద దేవా! దేవరయు ననునంతలో నాతండుఁ దెలివికలిగి తద్రూపంబునన వెఱసి చనుదెంచి యనుగ్రహించెదఁ గాక యనుచుండ నింతలో. ౭౪

ఏమి తండ్రి వీవు? నా ముద్దుఁ గను తల్లి
కుదరి యిట్టి శాప మొసఁగి తెందుఁ
గాన నీ విరక్తి గ్రంథముల్ గింథము
లనుచు గుహుఁడు వాని నద్ధి వైచె. ౭౫

అతసిఁ జూచి రోస మగ్గల మై యింక
గ్రుడ్డు వెక్కిరించుఁ గూన నోరి!

నీ మదం బడంగఁ గోమటి వగు మిల
నలి పురి మదనుగ్రహాంత మనియె. ౯౮

దానికి విఘ్ననాథుఁ డెడదం గడుఁ జింతిలి రోషగర్వవా
చానయ మొప్ప నోజనక ! చక్కటి కర్ణముఁ గూర్చి తిట్టి యీ
హూనికి నేర్పినా రెవరొ ? పో కని యొవ్వనివా రటన్న నీ
శానుఁడు రోషరూషితకషాయవిలోచనుఁ డౌచు ని ట్లనుజ్. ౯౯

ఓరి మూర్ఖ ! గణేశ్వరత్వపద మెట్లో వచ్చె నా కంచు గ
ర్వారూఢిం గికురింతె నన్నుఁ ? జనుఁ బొమ్మా దారియే నీకు నుం
బౌరోహిత్యముఁ బూని తన్నగరి విప్రత్వమ్ము వాటించి నీ
వారాధ్యాస్మదనుగ్రహాంతము మనుష్యాకారముం బొందుమా. ౧౦౦

అనుచుండ నచ్చటికి శిలాదతనయుండు నవినయంబుగా వచ్చుటయు.

వచ్చిన నందికేశ్వరుని వారక చూచి విభుం డొకింత దా
నిచ్చఁ దలంచి యోరి ? నరియే యొక బెత్తము చేతఁ బూని నీ
వచ్చుట మాకు శిక్ష నలుపజ్ గద చూతము పోయి వారిధిజ్
మచ్చెమ వై చరింపు మటు మంచి పదార్థముఁ బుక్కిటం గొనజ్ఞాలం

అనియె మెదలెడు వా రెవ్వ రచట లేమి
మహితుఁ బ్రార్థింప బోవ సంభ్రమముఁ గంటి
నేనుఁ గనుగొంటి నింతలో వాని మనుసు
దీన లోపమ్ము లే దని త్రిప్పుకొంటి. ౧౦౧

అని హృషీకేశుఁ డెఱిఁగింప ననఘ ! నీకు
భవునకును లేదు భిద యని పలుకు నాగ
మము లతఁడు ని న్నతని నీవు మఱి పొగడుచు
రది మదిం గొనె నా గుట్టు నానతీవె, ౧౦౨

అంతవాఁ డింత కింత క్రోధాంధుఁ డగుచు
హంగు చెడఁగొట్టుకొనుట నీవదియు నొక్క
మే లనుట చిత్ర మయ్యెఁ జూమీ భుజంగ
శాయి! యని నేను ప్రార్థింప శౌరి యనియె. ౮౩

అవని సుధర్మనామమున నంచితుఁ డౌ నొక దాశరాజు మా
నవనవతావిశిష్టమణి నాఁ దనవారలు చేరి కొల్వ నొ
ప్పవు భయభక్తియుక్తి మనమార భజించు భవు న్భవాని ను
త్సవములు సల్పుఁ దన్మనము తన్మయ మెప్పుడుఁ గోరఁ డెద్దియున్.

ఆయన సాధ్వి సాధ్వి యతఁ డాయమయుం దగ సర్వసంపద
త్యాయతభోగయుక్తు లయి యాశివుఁ గొల్తు రకామకాము లై
పోయిరి నేఁడు దేవళము పొంతకుఁ బున్నెము పండ దేవతా
రాయుని సేవసేయ శివరాత్రి యటంచు విశేషశేముషిన్. ౮౫

ఆలయములోన దీపపు
మాలికల న్వెలుఁగఁజేసి మాహేశ్వరత
త్త్వాలాప మొప్ప నుపవా
సాలస్యము దోఁచకుండ నయ్యెడ నుండన్. ౮౬

ఆసాధ్వికిఁ గననయ్యె వి
లాసస్ఫురణములఁ జంచలానద మన మే
నాసుత విగ్రహ మది గని
యీ సతి సుత యైనఁ బెంచనే పున్నె మనన్. ౮౭

అనుకొనియె నాలు మగఁడుం
దన మనమున మృడుని నిలిపి ధ్యానస్థితిమైఁ
గొనియాడుచుండెఁ గలిగెన్
గనకాచలధన్వి కిట్టి గరగర లిచటన్. ౮౮

అని నెపంబుగ శాప మట్లగజ కిచ్చె
నాయమయుఁ బుట్టకుండుట నభిలషించె
లీల పూరిత మగుటకు నేలఁ బుట్టుఁ
దనియెఁ బుత్రులఁగూడఁ జంద్రార్ధమౌళి. ౮౯

వారిధిలోని పొత్తములు పాడ్వడకుండ ధరించి ప్రోవఁగాఁ
గౌరి శపించె భృంగిరిటుఁ గుత్సితమైనశరీర మందు మం
చీ రహిఁ బూని భక్తుల మనీషితము ల్సమకూర్చు శర్వుఁ డా
ధోరణి యా విధాన మల ధూర్వహభావము వానికే తగుఁజా. ౯౦

అని వచించుచుండ నడ్డ మై పార్వతి
పుట్టు వెనయ కెట్లు పుత్త్రి యగునొ ?
విభు ప్రసాద మెట్టి వెరవున వచ్చునో ?
యదియు నదియు నొడువు మని యడుగుడు. ౯౧

కొలువు దీర్చు సుధర్మునిఁ గొలువవచ్చి
యబ్ధి వల వైవ దొఱికె నియ్యది గొను మని
దక్షిణావర్తశంఖంబు దాశుఁ డొకఁడు
గాన్క యిడు నందుకొని వాఁడు గను ఘనముగ. ౯౨

ఆ శంఖంబునఁ దోఁచు ము న్నకల యై యంగుష్ఠమాత్రాంగి యై
శ్రీ శంపాలతికాశతంబులకుఁ బై చేయై సరోజాతనీ
కాశాక్షిద్వయ యై శిరోరుహనవాకారాఢ్యశృంగారసం
వేశాభాంచిత యై గిరీంద్రసుత యుర్విం గ్రొత్త బాల్యంబునన్. ౯౩

కమనీయకాంతులు ఘనరసస్ఫూర్తులు
గాంచె సందేహసంకర మనంగఁ
బదియాఱు కల లరువదినాల్గు కలలు స
నందె ననఁగ

నైరమ్మదనరమ్ము లాత్మప్రసాదమ్ము
లేకరసత్వమ్ము నెసనె ననఁగ
గనకగౌరవములు కౌసుమసంపద
లద్వైతమును గొనియాడె ననఁగ
నైన సూతనతనుభాన మూని భక్త
వత్సలత దోఁప విహరించు భవునిరాణి
మాయ యనఁగ విజృంభించి మహితశక్తి
మమ్ము మాబోంట్ల నాడించు నెమ్మెలాడి. ౯౪

పదఁపడి నవలారతనము
పదుమూఁడు దినములలోన భాస్వరథామా
స్పద మవు యౌవన మెనయుం
దుది వని నద్దేవిఁ గని రతుం డవు శివుఁడుౘ. ౯౫

ఆ లలితం దటిఁ బడయుఁ గృ
పాలుఁడు వైశ్యుఁ డవు కొడుకు పసతి వసించుౘ
లీల విభు నాన మాయా
జాలమ్మున భృంగినాథశఫరముఁ బట్టుౘ. ౯౬

విష్ణువిభుఁడు పురోహితవిప్రుఁ డగుడు
నభవుఁ డా దేవి విధివివాహమునఁ బొంది
మిత్రుఁ డవు పుత్తుృతో సిరి మెఱయ నుండు
నత్తమామల గృహమున నాఱు నెలలు. ౯౭

అంత నిఁకఁ బోయివచ్చెద మని వచించి
యతఁ డతండును నాతండు నమసరింప
బడఁతిఁ గైకొని దివ్యవైభవమున నొక
తెరువునం జని చని తా నదృశ్యతఁ గను. ౯౮

ఇది శివుని లీల దీనిం
జదివిన వ్రాసినను వినిన సంపద లమరున్.
విదితముగ ననుచు విష్ణుం
డొదవిన నిద్రాసమాధి సూచకయుండెన్. ౯౯

నేనును సఖ్యు లచట నా
త్మానందముఁ జెంది లచ్చి యాన వెతలి యా
యా నెలవులకుం జనుచో
నే నరిగితి సత్యలోక మీక్షింపగన్. ౧౦౦

అచ్చట నున్న వేల్పులు మహామునులు న్నను నాదరింప నీ
ముచ్చట లెల్లఁ జెప్ప యటపోయితి నా త్రిదివంబుఁ జూడఁగా
నచ్చరలున్ శచీపతియు నచ్చట నచ్చెరు వంద నిక్కథల్
చెచ్చెర పల్క వచ్చితి విచిత్రమనమ్మున మిమ్ముఁ గన్గొనన్. ౧౦౧

ఎంతటి ధన్యులో కదె? మహిస్థలిఁ బున్నెము రూపు గాంచి స
ల్లింతు నినున్ భవత్సతి సహనగుణుం డవు చేవుఁ డాలితో
సంతతితోడ బాంధవము చక్కటిఁ గొల్చిన వారిమిద్దు ల
త్యంతసుఖంబునం గను మహత్త్వముఁ జెందితి రేమి సెప్పుదున్.

ఫలమూలాశను లై వనంబుల సుఖవ్యాపారము ల్మాని పె
ద్దపులున్ లెక్క యొనర్ప కబ్దశతము ల్పూర్ణంబుగా భక్తిఁ జి
త్తలసత్పద్మనివిష్టు నీశ్వరుని నిధ్యానించు నా యా తప
స్విలకుం జిక్కని శర్వు బాంధవముచొప్పుం గంటి రీ రల్పులే? ౧౦౩

అని యిటు నారదనారదుఁ
డెనయించెను సవ్య తుష్టివృష్టికి సుఖ మా
ఘనుల మనశ్చాతకములు
కనికని మఱి యొల్లఁబోయె క్షణ మవశము లై. ౧౦౪

తెలిసి యంత నేమి ? దేవుఁడా ! నారదా !
తెల్పుమయ్యా యెట్లు ద్రిసయుమంచె
యల్లుఁ డయ్యె నేమి ? తల్లి భవాని మా
పుత్రి యయ్యె నట్టి మునివరేణ్యా ? ౧౦౩

ఎఱుఁగము భక్తివిశేషము
లెఱుఁగము వ్రతములును దపము లెఱుఁగము నుతులం
చెఱుఁగ మిఁకే యాచారము
లెఱుఁగము మము వారి కరుణయే వెలయించెన్. ౧౦౬

ఏడ్చుచో మాబిడ్డ సేవగించితి మేమొ ?
మా కన్నతల్లి కా మాట కలదె ?
యది యిది వెమ్మన్న నదలించితిమొ యేమొ ?
యటు లున్నె మా వరహాల మూట ?
కాటల కేగుచో నడ్డగించితి మేమొ ?
మా ముద్దుకొండ నెమ్మది నెనయమె ?
విసివింప నెప్పడేఁ గసరికొంటిమొ యేమొ ?
మాకనకమున కా పోక లెవ్వి ?
యింక నే యే యెడల నేమి యెఱిఁగి యెఱుఁగ
కకట మా యమ్మ కపచార మాచరించి
నారమో ? నారదా ! నయనములు మూసి
దొంగదేవర మమ్ము నీ త్రోవఁ బఱపె. ౧౦౭

ఇది మా జనని యంచు నించుక తెలిసిన
నడుగులఁ బడి పొరలాడమొకొ
యిది యపర్ణ యటంచు మదికిఁ దోఁచిన నన్న
పానము ల్వదలు పెం పూనమొకొ
యిది గట్టుదొరపట్టి యే యనుకొన్న సై
ర్యమ్ము డెందమ్ముల నందమొకొ

ఇది యీశు రాణి యం చెఱిఁగిన మా వైభ
　　　　వము లప్పనం బిచ్చి వఱలమొక్క
ఇది యపూర్వపుఁ దేజ మం చెఱఁదఁ గన్న
నేమి యేమియొ సేయమే ? యెఱుకపడిస
సన్నియు నొనర్తు మని మది నెంచి యోర్వ
లేక యూలరి వేలు పీ పోకవోయె. ౧౦౮

మా యమ్మ యేమి సేయుం
గాఢజరిపు శాపగరిమఁ గాయముఁ గనుటన్
మాయామోహిత యయ్యెం
బో యభవుఁడ యింతసేసెఁ బోలు నటంచున్. ౧౦౯

ఆ పరమేశ్వరు దూఱుట
లోపము గాదా ? స్వబుద్ధిలోపమ యెదియుం
దోఁపఁగనీక యలంచెం
బాపసవర ! మాకు ముందు దారి దెలుపుమా. ౧౧౦

ఇది వేల్పురాన్య మం చెఱుఁగరాదొకొ ? సంకు
　　　　వందు ముందరఁ బుట్టు పందుటఁ గని
జనిఁగన్న పదమూడు దినములలో యౌవ
　　　　న మ్మెనయుటయు సాక్ష్యమ్ము కాదొ ?
యూ తేజ మా సొయ లా తెల్వి వ్యాఖ్యాన
　　　　మొనరింపవో ? నిజ మనువుపడఁగ
మా యమ్మ యిది యను మాటకు నవ్వ నా
　　　　యమ చొకాటముఁ గాంచి యరయరాదొ ?
యున్నియు నటుండ దుస్తర మైనవార్ధి
యొడ్డునన నిల్చి యా మీను నొడియు విభునిఁ
గని యియన్మాత్రుఁ డన దారి గలదె ? చాలి
మమ్ముఁ బూనిస శనియొ సర్వమ్ము దాచె. ౧౧౧

ఎదుటఁ దోఁచిన దేవి కిందుమౌలికి భక్తి
యుక్తి మ్రొక్కని మేని యోగ మేల ?
మూర్తీభవించిన పుణ్యరాసుల మేల్మిఁ
గొనియాడ లేని వాక్స్ఫురణ మేల ?
యింద్రియంబులు గన్న సాంద్రసౌఖ్యమ్ముల
నెఱిఁగి మెచ్చఁగలేని యెడఁద యేల ?
చేతికి నబ్బిన సిరుల కొటారులఁ
బరికించుకొనలేని భాగ్య మేల ?
యెలనేలఁ బొడమితి మి ట్లేలవచ్చి
దైవమేటికి హాస్యాస్పద మ్మొనర్చె ?
నిట్టి మా కింక గతి యన నేమి కలదు ?
భవ ! భవా ! యని గంగలోఁ బడుట దక్క. ౧౧౨

అని యేమేమొ వచించెడు
ననఘులఁ గని నారదముని యానందమునన్
ఘనులార ! యిట్లు వగచుట
పనియే ? పురహరుఁడు మీకు బంధువుఁ డయ్యెన్. ౧౧౩

ఇంక మీ రా పరమేశ్వరు నారాధింపుఁడు. నేఁ డనుగ్రహింప నున్నట్లు తోఁచుచున్నది. మీ కక్షయ మ్మగు నయ మ్మమరుఁగాత మని పయన మైన యా శుభసూచకుఁ జేరి మ్రొక్కియుఁ బ్రార్థించియు శ్లాఘించియు నుపచారము లొనర్చియు తత్సంగతి నగు హర్షంబున వియోగజ మగు విషాదమ్మున రెండు కన్నుల బాష్పమ్ములు గ్రమ్మ నోదక మ్మాతని ననిచి వీడ్కొని పట్టరాని హర్షభక్త్యుత్సేకమ్మున బట్టువట్టి యాజాయాపతులు పార్థివలింగమ్ముల నద్దేవు మే నమర్చి షోడశోపచారమ్ముల నుపోపచార మ్ములఁ బూజించి కనులు మూసి యింద్రియమ్ముల మఱచి ధ్యానధారా ప్రవాహమ్మున నిమగ్నులై యున్నంత. ౧౧౪

## ఈశ్వరానుగ్రహము

కనుదోయి "కిదమిత్థ" మని నిర్ణయింపగా
నిమ్ము గాకున్న రూపమ్ముతోడ
నే నాల్క లెడఁదలు నెప్పుడు నెఱుఁగని
కమ్మని స్వరస రసమ్ముతోడ

నే ఘ్రాణములకు ననాఘ్రాతపూర్వ మై
గమ్మనఁ గ్రమ్ము గంధమ్ముతోడ
నేత్వాచ మేనాఁడు నెనయని యెలచల్ల
నమ్మన మించు స్పర్శమ్ముతోడ
నే శ్రుతు ల్మన్ను కానని హేతువున మ
నమ్ము వచ్చెడు పెచ్చు శబ్దమ్ముతోడఁ
బంచభూతమ్ములకు నిదె ప్రకృతి యనఁగ
నైన తేజం బొకొండు ప్రత్యక్ష మయ్యె. ౧౧౫

ఆ తేజముఁ గని వచనప
థాతీతోద్గీర్ణ పూర్ణ హర్షవశతమై
నా తఱి సాత్త్వికభావ
వ్రాతము పొలుపమరఁ దత్కృపాధృతమతు లై. ౧౧౬

కాలస్వభావనియతులు
నోలి యదృచ్ఛయును భూతయోనిపురుషులుం
జాల వని యశ్వతరి యే
నేల నుతింపందొడంగె నీ వది కావే ? ౧౧౭

నీయెడ సూర్యుఁడు చంద్రముఁ
డా యుడుతతి మెఱుపు లగ్గు లందవు భావం
బీ యఖిల మనుసరించు
న్నీ యలరున నెలమిఁ గాంచి నిఖిలనిదానా ! ౧౧౮

సర్వతశ్శిరుఁడవు సర్వతశ్చక్షుండ
వంఘ్రు లొప్పు నీకు నన్ని యెడల
భూతభవ్యమూలభూతభూతం బవు
భూతనాథుఁడవు స్వభువవు దేవ ! ౧౧౯

సర్వేంద్రియవర్జితుఁడవు
సర్వేంద్రియసద్గుణవికసనమూలమవుఁ
సర్వవిభుఁడ వీశుఁడవుఁ
సర్వశరణుఁడ వగు నీవె శరణము మాకుఁ. ౧౨౦

పాదపాణివిరహితుఁడవు త్వరితుఁడవు గ్ర
హీత వింక నచక్షుఁడ వెల్లగాంతు
వశ్రవుండవు వినెదు వేద్యంబు నెఱుఁగు
దెఱుఁగ రెవ్వరు నగ్ర్య నహీను నిన్ను. ౧౨౧

అజ్ఞాతం బగు చీఁకటి
విజ్ఞుఁడ వై సదసదితరవిధ మెనయుదు నీ
యాజ్ఞఁ బురాతని యగు నా
ప్రజ్ఞయు నిఖిలమునఁ దాన ప్రసరించు బలే. ౧౨౨

నీ రూపు చూపుదాటిం
జేరద యీ దృష్టి నిన్నుఁ జేరఁ దొకం డిం
పార హృదయస్థు నిం జి
తారూఢి నెఱుంగు నతఁడ యమృతమ చెందుఁజా. ౧౨౩

అని యిట్లు పలువిధమ్ముల శ్రుత్యంతమ్ములు వర్ణించు నీ తత్వమ్ముఁ దత్త్వదృష్టి నెఱుంగ నే మెంతవార మీ వెలుంగుఁ గనలేక మా కనులు మిఱుమిట్లు గొనుచున్నవి. దేవా! నిర్హేతుకజాయమానకరుణాపీఠా! నీ సగుణవైభవంబుఁ జూపవే. కృతార్థుల మగుదు మని కొనియాడు వారల ప్రార్థనలకు ననుకూలం బై యా తేజం బాక్షణంబ. ౧౨౪

పాలకడలియందుఁ బవడంపుఁదీవనాఁ
దన మేన సిరి గౌరి దనువుచుండ
ముచ్చటమూట నా మొనయు చొల్లెమ్ముపై
బాలేందుకల పూలబంతిఁ బోల
నందంపుగుఱి యైన యౌదల మినువాఁక
వాకొనరాని శోభనము లీన
భూషణాకృతి నొప్పు భోగిభోగంబుల
మానికంబుల డం బమానుషముగ
వృషభవాజితోడ విఘ్నేశ్వరునితోడ
శక్తిధరునితోడ భక్తి మెచ్చి

ము క్తి నొసఁగ వచ్చి మురిపెంబుఁ దీర్పఁగాఁ
జొచ్చి కాననయ్యెఁ జూడ్కులలర. ౧౨౫

ఆనందాతిశయమ్మున న మ్మిథునమ్ము సర్వాంగాలింగితభూతల మ్మగు నమస్కారమ్మున సాదరార్చనల నప్పరమేశ్వరు నుపచరించి యుత్సాహాతిశయమ్మున నిట్లనిరి. ౧౨౬

అఖిలమంత్రరాజ మైన గాయత్రికి
వల్లభుండ వగుచు వఱలుకతన
నాదిదేవుం డైన యచ్యుతుం డెడఁద ని
న్నెంచి స్థాపించి పూజించుకతన
నుపనిషత్సమితికి ను త్తమాంగం బశ్వ
తరియు నిజ బరముఁగాఁ దలఁచుకతనఁ
బ్రాచీను లవు కవివరు లెల్ల నీయంద
భావముంచిన యనుభవముకతన
భువనహేతువు లవు పంచభూతమూ లిన
మృగధరులు యజ్వ నీ మూర్తు లగుటకతనఁ
బ్రమథగణనాథ! నీవె పరాత్పరుఁడవు
నిన్నె మృత్యుంజయుండ! చెందితిమి శరణు. ౧౨౭

ఎక్కెదవుగాక ముదుసలి యెద్దు నొకటిఁ
దొడిగెదవుగాక పాపపెందొడవు లొడలఁ
దిరిగెదవుగాక వలకాట దేవదేవ!
వెఱ్ఱి వని నిన్ను విడువరు వేదవిదులు. ౧౨౮

విషనిధి లోకముఁ గాల్చెడు
విషము పొడముఁ బ్రదుకుఁ గోరు వేల్పులకొఱ కా
విషముం గుత్తుకఁ దాల్చవె
విషమాంబక! ప్రభువు లెల్ల వెలితిఁబడంగన్. ౧౨౯

ఏవముఁ జెందక వాకిలి
కావలులుం గాచి సర్వకామము లిడుచున్

భావింతు మున్ను భక్తుల
నీ వెవ్వరిఁ జూచి నేర్చి తీ వెడమాయల్. ౧౩౦

మాయాకిరాతరూపుఁడ
వై యర్జును మోసవుచ్చి త మ్మిడ నాఁడున్
మాయాకైవర్తుఁడ వై
యా యనదల మోసవుచ్చి తీశ్వర ! నేఁడున్. ౧౩౧

అని కొనియాడుచు నున్నెడఁ
దన మదిలోఁ గూఁతు నల్లు దర్శింపఁగ నెం
చెను సాధ్వి యప్పుడపుడె త
దనురూపం బైన రూపు నందిరి శివులున్. ౧౩౨

అంత నాయమఁ గాంచి యా యమ్మ యంత
యును మఱచి యమ్మరో ! యెన్ని దినము లయ్యె
మిమ్ముఁ గనుఁగొని మధురలో మీరు లేర
టంచు మనవారు చెప్పరమ్మా యటంచు. ౧౩౩

దరిఁజేరి కౌఁగిలించి కంటఁ దడి యొత్తుచు బాష్పగద్గదకంఠంబున.

ఏనును నీదు తండ్రి మది నెంతయుఁ జింతిలి మిమ్ముఁ గాంచఁగాఁ
బూనిన యా వ్రతంబు సిరి పో మన వేల్పులు మెచ్చి రింత కే
యే నెలవందు నున్న మము నేమఱవచ్చునటమ్మ యుత్తరం
బేనియు వ్రాయరాదొ ? యెటు లెందుఁ జరించిన మాకుఁ గూఁతురా !

మన కేమి యనుచు నల్లుం
డును నీవును మదిఁ దలఁచిన నొవ్వెనయక మే
దినిఁ గన్నకడుపు సొదఁ బెం
చిన మోహము నాఁగవచ్చునే యెవ్వరికిన్ ? ౧౩౪

అత్తమామల చిత్త మరసి సేవింతె ? యే
నాఁడు వారల దీవనలు పొనంగ
సఖుల వృత్తాంతంబు సవతుల నెఱపెదే ?
నిరసూయ లై వారు నెమ్మిఁ గొలువ

దాక్షిణ్య మొప్ప భృత్యజనులఁ బోషింతె
సతము వా రెదఁదల సంతసింప
నాథుఁ డల్గినను నేనాఁ డైన నల్గక
యనుసరించెదె? మెచ్చి యౌ ననంగఁ
దల్లి యని బిగికౌఁగిటఁ దాల్చెడు తన
సతినిఁ గాంచి సుధర్ముండు సంభభావ
మెనసె నా చాయ కాయె నా యాశ్వయుండు
నగజయుంగంటఁ దడివెట్టె నవ్వేలయఁగ. ౧౩౬

స్తంభభావంబు గలిగె నా స్థాణున కన
నొదవుఁ గవిదృష్టి నొక పునరుక్తి యట్లె
కలిగె నచలాత్మజకు మేనఁ గంప మనిన
నతిశయోక్తి మఱొక్కటి యవతరించు. ౧౩౭

ఈ రీతి సపర్య్యంబును
సారం బగు నూతనరసఝరిఁ దోఁగెడు న
వ్వారికిఁ బురాణదంపతు
లారూఢాత్మస్వరూపు లయి కన నైనఁజా. ౧౩౮

భయభక్తివైస్వర్యలజ్జాస్మితాదు లొక్కపెట్ట నేటుకొన నాల్కలు గఱచి కొనుచు నా సాధ్వీసుధర్ములు తెలివిఁదెచ్చుకొని యో ప్రకృతిపురుషులారా? మీ మాయ యను లోయం బడి స్వయంభూప్రముఖులు నఖండైకరస స్వస్వరూపానుసంధానచణులు గా నేరక యంతఃకరణగుణాధ్యానవశంబున సంసారిత్వ మ్మధిగమించి దీర్ఘప్రారబ్ధవశమ్మున నాధికారికపురుష లయ్యు నహంకారంబు ననువర్తించుచుండ మానవులము దాసులము నగు మాకు మీ తత్త్వం బెఱిఁగి కొలుచు నంతటి పేర్మి యెట్టు లబ్బు? అపరాధసహస్రంబు దయాదృష్టిమెయి క్షమించి యీ దీనుల బాలింపుఁ డివె వందనబృందంబు లని పాదపద్మంబుల వ్రాలి వృత్తిరహితం బగు చిత్తమ్మున తత్తనువులచిత్తరువుల పోల్కి నిలువ బహిరంతరైకరస్యమ్మున నున్న నవ్వారి మేనులు నిమురుచు ననుగ్రహవిశేషమ్మున నా పురాణదంపతులు.

మెచ్చు వచ్చె మాకు మీ చిత్రచారిత్ర
మునకు భక్తిసూక్తివినయములకు

చిత్తలార! మీకుఁ బ్రియము లౌ వరములఁ
గోరుకొనుఁ డొసంగువార మనిన. ౧౪౧

సాధ్వియు సుధర్ముండును సుధాహ్రదంబున మునిఁగి తేలుచున్నట్లు నిర్వే
లానందంబునం బొంది బొంది మఱచి మరల బ్రకృతిఁ జెంది యిట్లనిరి.

ఇంద్రచంద్రాదిసంపద లేమి సిరులు
కామసంహర! మాకు నక్కరయ లేదు
మున్ను దాసులమే కదా పున్నె మున్న
నాశఁ దొలఁగించి సత్త్వమ్ము ననువు పఱపు. ౧౪౩

అడుగుటయుఁ జేత గాకున్న యట్టివారి
జననమరణశ్రమంబుల నెనయకుండ
నెట్లు పోషింపఁ దలఁచితి వట్ల చేయు
మిది యది యటంచుఁ గోర మా కేమి దెలియు. ౧౪౪

అమృతముం ద్రావి చావని యమరు లెల్ల
చచ్చుచుండంగ నింత విసంబు మెసవి
బ్రదుకుచుండెద వే మంబువలన నీవు
దాని నెఱుఁగంగఁ జెప్పు తత్త్వము మహేశ! ౧౪౫

ఈవిధమువారి శర్వా
ణీవల్లభుఁ డెఱఁద మెచ్చి నెమ్మి ననియె మీ
భావంబు వొందెదు సఫల
భావంబు నటంచు నంత భావము వొంగన్. ౧౪౬

చదివినను వ్రాసినను విన్న మదిఁ దలఁచిన
మీ కథ హరించుఁ గలమలానీక మెల్ల
నొక్క సుకవి యస్మద్భక్తుఁ డుర్విఁ దోఁచి
మీ చరిత మాంధ్రభాష నిర్మించు నంతృప్తి. ౧౪౭

ఐదు వే లేండ్లు కలియుగ మం దగుతఱి
కావహిల్లిన దుర్ముఖిశ్రావణమున

నుత్తరాభాద్ర శశిగూర్చు నుక్షరాశి
నుదయ మెనయంగలాఁడు వాఁడూర్జితుండు. ౧

అని గౌరి యానతీయం
బినాకి యానక్షణ నమీపపృథ్వీగత మై
కన నైన నొక విమానం
బునఁ జెందిరి వారు దేవభూయ మెనయ నై. ౧౧

ఇట్టు లవ్వారి నేలి సర్వేశ్వరుండు
తాను దనవారు వారు నంతర్ధి నెనసి
రనఘులార! మహేశు దయారసమ్ము
న్వగతిఁ బాఱఁగ మెరకపల్లములు కలవె ? ౧౫

అని వినుచు రోమహర్షణ
తనయుం గొనియాడి యాశతాత్పర్యమునక్ష
ముని లుండి సర్వచరితము
మనసం బొనరించి రెదల మాన్యచరిత్రా! ౧౫౧

సుగుణాలవాల! తర్పిత
జగతీత్రిదశాళిదత్తసామ్యాశీర్వా
దగుణాపితాప్యసారా!
న్వగురుప్రీణనవిధావశప్రణిధానా! ౧౫౨

శ్రీమాధుర్యస్థితిమతికలాస్థేమధామాయమానా!
భూమానందస్ఫురణకలనాపూర్ణచేతఃప్రసాదా!
సామోదాంతర్యజన! పిసిపాట్యన్వయోత్తంస! సీతా
రామాఖ్యానా! ప్రకటితధృతీ! ప్రాంచదన్మత్ప్రతీర్థా! ౧౫౩

ఇది శ్రీమద్రామకథామృతకవికుమారహనుమాంబాశమీగర్భహవిర్భరాయ
మాణ శ్రీదేవీసేవ్యమాన రాఘవనారాయణాభిధాన కవి గ్రథిత
... విశ్వ ... కైవర్తకం బను ప్రబంధంబునఁ
గుణాలంకారంబును బంచమాశ్వాసము. శ్రీ శ్రీ శ్రీ

## శ్రీ రామ కథామృత గ్రంథమాల

—•ooo•—

### శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రివారి

| | | |
|---|---|---|
| శ్రీరామ కథామృతము, | బాలకాండము | 5–0–0 |
| ,, | అయోధ్యాకాండము | 4–0–0 |
| ,, | ఆరణ్య, కిష్కింధా, సుందర | 6–0–0 |
| ,, | యుద్ధకాండము | 5–0–0 |
| ,, | ఉత్తరకాండము | 6–0–0 |
| కవిగుణప్రకాశిక | | 1–0–0 |
| త్రిశంకుస్వర్గము (నాటకం) | | 1–0–0 |
| భద్రాయురుపాఖ్యానము (నాటకం) | | 1–0–0 |
| సత్యనారాయణ వ్రతమాహాత్మ్యము | | 1–0–0 |
| మధురావిజయము | | 1–0–0 |
| శంకరవిజయ కథాసార సంగ్రహస్తోత్రము | | 1–0–0 |
| కల్యాణి కైవర్తకము | | 2–0–0 |
| కాకాని మల్లీశ్వరమాహాత్మ్యము | | 2–0–0 |

అచ్చులో ఉన్నవి:

* యమావిక * పుష్పమంజరి * కాలభాగవతము
* శ్రీశైలతీర్థసారము (సంస్కృతకావ్యం)–మున్నగునవి

☞ 20 రూపాయలు చెల్లించిన చందాదారులకు పై గ్రంథము లన్నియు నొసగబడును.

తాడేపల్లి బాలకోటీశ్వరశాస్త్రి

పెనపాడు : : తెనాలిపోష్టు